# ఆంతరంగికజీవితము.



## ప్రథమభాగము.



"నన్ను ననుసరించువా రజ్ఞానాంధకారమునఁ బ్రవర్తింపరు" అని జీససు జెప్పెను. మనము జ్ఞానతేజస్సుతోఁ బ్రకాశింపఁదలఁచినప్పుడును అజ్ఞానాంధకారమునుండి విముక్తిఁ బొందఁదలఁచినప్పుడును మనము జీససుయొక్క జీవితమును వాని పరిశుద్ధ ప్రవర్తనను ననుసరింపవలసియున్నదని జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలయును. కనుక మనము జీససుయొక్క పావనజీవితమును మననముచేయవలసియున్నది. జ్ఞానులు, యోగులు, మొదలయినవారు బోధించిన బోధనలకన్న నీమహాత్ముని బోధనలు మిగుల వన్నెకెక్కియున్నవి. జ్ఞానదృష్టిగలవారికందఱికి వానియందు దివ్యప్రభావము ఇమిడియున్నట్లు కనుపించుచున్నది. కాని జీససు బోధనలవినువారిలోఁ జాలమంది దానియందలి దివ్యప్రసాదము ననుభవింపలేక పోవుచుండిరి. కారణమేమనఁగా ఆమహాత్మునియందుఁ బ్రకాశించుచున్న జ్ఞానతేజస్సు వీరియందు లేకపోవుటయే కారణము. నీవు పరిపూర్ణాసక్తితో

వానిబోధనలయందలి భావమును బొందఁదలఁచినయెడల వాని జీవితముతో నీపవిత్రత యన్యోన్యమైయుండుటకుఁ దగినంత శ్రద్ధతోఁ బాటుపడవలసియున్నది. నమ్రభావములేక కమాత్రిత్రియసిద్ధాంతమును దర్శించుటవలన నేమిప్రయోజనము? యుక్తులును వాదనలును మానవునకుఁ బావనత్వమును గలిగింపనేరవు. యోగ్యమైన పావ జీవితముమాత్రమే పురుషునికి నీశ్వరరాజ్యమును సంఘటింపఁజేయును. ఈశ్వరుని యందు ప్రేమయు భక్తియు లేనప్పుడు వేదమంతయు సాంగముగాఁ జదివినను సర్వశాస్త్రముల నభ్యసించినను నేమిప్రయోజనము? ఈవ్యర్థ డంబములవలన లాభమించుకయు కనుపించదు. శాశ్వతపదవియందు సుఖించుటకు నీశ్వరుని ప్రేమించుటయు సేవించుటయు ముఖ్యసాధనములు. నీవీశ్వరరాజ్యమును బొందఁదలఁచినయెడల ప్రాపంచిక విషయములయందు నిస్పృహత్వమును జెందియుండవలయును. ఇదియో మహాత్రగమైన జ్ఞానము. చంచలస్వభావమైన ధనము నపేక్షించి దానికొఱకుఁ బ్రయత్నించుట మిగుల నిస్సారమైన విషయము. పరసౌఖ్యమునకు విఘాతమును గలిగించెడి తుచ్ఛములైన శరీరభోగముల నాసించుటయు నిస్సారమే. ప్రపంచములో గొప్పవాఁడని పేరు పొందఁగోరుటయు గొప్ప పదవియందుండఁగోరుటయు నిస్సారములే. దీర్ఘకాలము జీవింపఁగోరుటయుఁ దనజీవితకాలమును జాగ్రత్తతో వినియోగింపనేరక వ్యర్థపుచ్చుటయు నిరర్థకములు. పరమార్థవిషయమొంతమాత్రము నాలోచింపక, ఇహలోకమే

శాశ్వతమని భ్రమించుట నిరర్థకము. “నేత్రము జూచినంత మాత్రముచేతఁ దనివిజెందుట లేదు. చెవి వినినంతమాత్రము చేతఁ దృప్తిఁబొందుట లేదు” అని బోధించిన మహాబోధకుని బోధనను స్మరణకుఁ దెచ్చుకొనుము. నీబుద్ధిని నీ దృశ్యపదార్థములఁ జూడవలయుననెడి యాసక్తినుండి మఱలించి స్థూలనేత్రమునకు గోచరింపని మహత్తరవిషయమును జూచుటకు వినియోగింపుము. ఇంద్రియ సుఖములయందు నీవనురక్తి గలిగియున్నంతవఱకు నీపాపస్వభావమునకు మాలిన్య మావహించియుండుటచే నీశ్వరరాజ్యమునకు నీవుదూరముగా నుండవలసియుందువు.

## 2. నమ్రత.

జనులు స్వాభావికముగా జ్ఞానము నపేక్షించుచున్నారు ఈశ్వరసముఖమున నాజ్ఞానమేమిలాభము? తన యాత్మాభివృద్ధి నపేక్షించి శాస్త్రాభ్యాసము జేయుచుండెడి తత్వజ్ఞానికంటె నీశ్వర సేవాని తుఁడైన యాథమానవుఁడు మిగుల నధికుఁడు. మానవతత్వము నెఱింగిన బుద్ధిమంతుని దృష్టిపథమునకుఁ దన నిజతత్వమే మిగుల నీచముగాఁగనుపించుచుండుటచే మానవుల స్తుతించుటకును మానవులచే స్తుతింపఁబడుటకును నపేక్షింపఁజాలఁడు. దానధర్మములు శూన్యమైయున్నప్పుడు ప్రాపంచిక విషయిక జ్ఞానము గలిగియున్నంతమాత్రముచేత నది యీశ్వర ముఖమున నెట్లుగణుతికెక్కఁగలదు? ఈశ్వరుఁడు నీకార్యము

లనుఁబట్టియే నిన్ను యోజించును. మిక్కుటమైన నీగడుసుదన మును విడిచిపెట్టుము. అది యధికమైన మనోవికలమును ప్ర మాంద్యమును గలిగించును. విద్వాంసులు తమవిద్యాప్రభావ మును లోకమునకుఁజూపి మేధావంతులమని పేరు పొంద నపే క్షించుచున్నారు. కాని యందువలన నేమిప్రయోజనము? అది యాత్మోజ్జీవనమున కెట్లు వినియోగించును? ప్రపంచజ్ఞాన మాత్మోజ్జీవనమున కెంతమాత్రము ప్రయోజనకారిగానుండ నేరదు. ఈశ్వరరాజ్యమున సుఖింపఁదగిన విషయముల నాలో చింపక తదితర విషయములయందు మాత్రమే దవిలియున్న మానవుఁడు శుద్ధమూర్ఖుఁడు. శుష్కవచనము లాత్మ కెంతమా త్రము దృప్తినిగలిగింపనేరవు నిర్మలమైన పవిత్రజీవితముమా త్రమే మనస్సున కానందమును విశ్రాంతిని గలిగింపఁగలిగి యున్నది. నీహృదయము పావనత్వమున బ్రకాశించుచున్న నే దప్పులేనియెడల నీయందు లోకజ్ఞాన మతిశయించినకొలఁదిని సంశయములు నీహృదయమునకు మఱింత భారమును గలిగిం చుచుండును. కనుక ప్రజ్ఞావంతుఁడననియు విద్యావంతుఁ డనని యు మెప్పొందనపేక్షింపకుము. నీవిపుడుగలిగియున్న జ్ఞానము ప్రమాదకరమైనదని నమ్ముము. నీకనేకసంగతులు దెలిసియున్న వని భావించితివేని యింకను నీకుఁ దెలియనిసంగతు లనేకము లున్నవని గాఢగా నమ్ముము. సర్వవిషయములయందును నీవు పరిపూర్ణుఁడవని భావింపకుము. నీవు కించిజ్జ్ఞుఁడవగుటచే నీజ్ఞాన మునకుఁ గొ అంతగలిగియున్నదని తెలిసికొనుము. నీకన్న తెలివి

గలబుద్ధిమంతు లనేకులుగలరని నీవెఱింగియుండియు ,,నేను మిగుల ప్రజ్ఞావంతుఁడ'' నని యితరులయెదుట నీవేలదంభములు పల్కెదవు? ఒకవేళ నీవేదైన లాభకరమయిన విషయమును నేర్చియున్నను నది నీకుఁ దెలియునట్లును నదియొక గొప్పవిషయము గానట్లును బ్రవర్తింపుము. తనకేమియుఁ దెలియదనెడి హైన్యభావమే తాను నేర్చుకొనవలసియున్న యమూల్యమయిన నీతిరత్నమని తెలిసికొనుము. ఏవిషయమునందును దానికొకఁడని యూహింపకుండుటయు నితరులే తనకన్న గొప్పవారని యూహింపఁగలుగుటయుఁ బరిపూర్ణమునకు గుఱుతని తెలిసికొనుము. ఇదియే గొప్పజ్ఞానము.

## 3 సత్యోపదేశము.

సత్యము శబ్దములవలనను, వర్ణములవలననుగాక, స్వాత్మసిద్ధమైన స్వరూపముతో నెవనికి బోధింపఁబడుచున్నదో, యాతఁడుమాత్రమే నిజముగా సదృష్టవంతుఁడు. వస్తుతత్త్వమును యథార్థముగాఁ బరిశీలింపలేకపోవుటచే మనభావములును, యోజనలును, మనలను మోసముజేయుచున్నవి. దురూహ్యములైన విషయములను మనకుఁ దోఁచినట్లెల్ల తదేకదీక్షతో నెంతకాలము యోచించినను మనకందువలనఁ బ్రయోజనము లేదు. వానిని మనము తెలిసికొనలేకపోవుటచే విచారణాసమయమున నీశ్వరుఁడు మనల దండింపఁడు.

తెలిసికొనఁదగిన విషయములను దెలిసికొనక యుపే క్షించుటయు, బాధకములైన మనకుఁదెలియని యద్భుతవిష యములను మనకుఁ దోఁచినట్లెల్ల విచారించుటయు మహాపరా ధములైయున్నవి. ఏలననఁగా, మనకుఁ గన్నులున్నను అవి మనకుఁ గనిపింపవు. తర్కవాదములయందు మన మేల ప్రవేశిం పవలయును? భగవద్వచనము నాలకింపనేర్చినవా రనేకవాదము లనుండి యుద్ధరింపఁబడుచుండిరి. ఆవచనమునుండియే సర్వవిష యములు వెలువడుచున్నవి. ఆతఁడే సర్వవిషయముల నుపదే శించుచున్న యుపదేశకుఁడు. సర్వవిషయములు వానినే సూచించు చున్నవి. ఆతఁడే సర్వమున కాదికారణము. ఆతఁడే మనకుఁ జెప్పుచున్నవాఁడు. ఎవ్వఁడీ లక్ష్యస్థానమును బొంది యెల్లవిషయ ములయందీబీజమునే సూచింపఁగలిగియుండునో, యెవ్వఁడీభా వముతో నెల్లవిషయముల యోజింపఁగలిగియుండునో యాతఁడు మాత్రమే యీశ్వరునియందు విశ్రమింపఁగలుగుచుండెను.

ఓసత్యస్వరూపుఁడా! శాశ్వతమైన ప్రేమయందు నన్ను నీతో నేకీభావము నొందింపుము. పెక్కుచదువులు చదువుటయు పెక్కువిషయముల నాకర్ణించుటయు నాకు విసుగుబుట్టించుచు న్నది. నేనపేక్షింపఁదగిన సర్వవిషయములు నీయందున్నవి. బోధకులందఱును మూకీభావమును వహింతురుగాక. జగత్తు యొక్క యావద్విశ్రాంతియు నీమూర్తిత్వమునందే ప్రకాశిం చునుగాక. నీవుమాత్రమే నాకుపదేశింతువుగాత.

శమదమములు మానవునియం దతిశయించినకొలఁదిని వానియంతరంగము నిర్మలముగాఁ బ్రకాశింపఁగలిగియుండును అప్పుడు వానిహృదయము పరమతేజస్సుతోఁ బ్రపూర్ణమై యుండుటచే, మహావిషయములయందుఁ బ్రవేశింపశక్తి గలిగి యుండును. పరిశుద్ధమైన స్థిరచిత్తుఁ డసంఖ్యాకములైన లౌకిక వ్యాపారములఁ దవిలి కలతనొందనేరఁడు. అతఁడీశ్వరప్రీతికొఱకు మాత్రమే వ్యవహరించుచుండును. స్వప్రయోజకత్వమును విడిచి హృదయమున విశ్రాంతిగలిగి సుఖించుచుండును. నీహృదయమునఁ బాడసూపుచున్న యపరిశుద్ధములైన మోహాభావములుదప్ప నిన్ను బాధింపఁగలిగిన వేఱువిషయములేవి? పావనస్వభావముగల మానవుఁడు బాహ్యమున దా ననుష్ఠించెడి విధాయకకృత్యములను మొదట తనహృదయమున నియమించుకొనును. వాని నాచరించునప్పు డాతఁ డపరిశుద్ధయోజనలకును దుర్భావములకును లోనుగాక యోగ్యమైన జ్ఞానవిచక్షణముపలన కార్యముల నడుపుచుండును. తన్నుదాను జయింపఁ జూచిన మానవునికన్న నెక్కుడు పోరాటమును గలిగియున్న మహాశూరవరుఁ డెవ్వఁడు. తనమనస్సును తానుజయించి దానిని యోగ్యతయందుఁ బ్రవేశపెట్టుటయే మానవుఁ డాచరింపవలసియున్న ప్రథమకృత్యము.

ఈప్రపంచమున నీజ్ఞాన మెంతయధికముగా నున్నను నది యింకను నసంపూర్తిగా నున్నదని భావింపుము. మన మెంతపరిశీలించినను మనకు గోచరింపని రహస్యము కొంతగల

దని యోజింపుము. శాస్త్రీయములైన గాఢపరిశోధనలకన్నను నీవు నిన్ను తెలిసికొనుచున్న స్వప్రజ్ఞాన మీశ్వరసన్నిధానమునకు నిన్ను నిశ్చయముగాఁ గొనిపోయెడి రాజమార్గమని భావింపుము. అయినను తెలివి, దానిజన్యస్వభావమును బట్టి యోజించినప్పుడును, అందుమూలమున తెలిసికొనఁబడుచున్న విషయములను బట్టి యోజించినప్పుడును శ్రేయోదాయకమును నీశ్వరనియమితమును నైనందున అది నిరసింపరానిదని తెలిసికొనుము. కాని యోగ్యమైన యంతఃకరణమును పావనమైన జీవితమును దానికన్న నత్యావశ్యకములని నెఱుంగుము.

అనేకులు సజ్జనులనిపించుకొనుటకంటె పండితులని పేరు పొందుట కధికముగా శ్రమపడుచుండిరి. అందువలన వారు తప్పుమార్గమున బడి నిరర్థకులగుచుండిరి. వారు విషయములను దెలిసికొనఁ బ్రయత్నించినట్లు దుర్మార్గమును వెదకివైచుటకును సన్మార్గమును నెలకొల్పుటకును బ్రయత్నించినయెడల లోకమున నిప్పుడగనుపించుచున్న చెడుగులును కష్టములును గనుపించనేరవు. మతమునం దిన్నిలోపములు నయితము గనుపింపవు. విచారణసమయము తటస్థించినప్పుడు మనము చదివిన చదువునుబట్టి యోజింపఁబడము. చేసిన చేతలను బట్టి యోజింపఁబడుదుము. మనము చెప్పినమాటలను బట్టి విచారింపఁబడము. మనము జీవించిన జీవితమునుబట్టి విచారింపఁబడుదుము. ఇంతకుముందు నీవెఱింగియున్న పండితులును ధనవంతులును బలవంతులును నిప్పుడేమైరి. వారలందఱును గతించిరి. వారి

స్థానము లితరులాక్రమించుకొనిరి. వారలనిపుడు తలచుకొను చున్నవారలెవ్వరును లేరు. వారు జీవించియున్నప్పుడు వారి ప్రాముఖ్యము వేనోళ్లఁ బొగడఁబడియుండెను. వారల జెప్పుకొనువా రెవ్వరును నిప్పుడు లేరు ఈప్రపంచవైభవ మెంత శీఘ్రములో గతించుచున్నది! వారిజీవితములు వారిజ్ఞానమునననుసరించియున్నయెడల వారిచదువులును శాస్త్రాధ్యయనమును కొంతలాభమును గలిగించియుండును. ఈశ్వరసేవ నిరసించి విద్యాధికులందఱు గర్వాతిశయమున నశించిరి? ఎందుచేతననఁగా, వారడఁగిమడఁగి వినములై యుండుటకంటె యుక్తులని పేరుపొందుట కెక్కువగా నభిలషించుచుండిరి. కావున వారు వారి యోజనలయందు నిరర్థకులై యుండిరి. దానధర్మములయందధికుఁడైనవాఁడు నిజముగా నధికుఁడు. తనదృష్టికి దానవల్పుఁడుగాఁ గనుపించుచున్నవాఁడు నిజముగా నధికుఁడు. గొప్పపదవులయందలి గౌరవమును నాశింపని వాఁడు నిజముగా నధికుఁడు. ప్రాపంచిక భోగములను ఐహికవిషయములను క్రీస్తు నొందుటకొఱ కెవ్వఁడపరిశుద్ధములని నిరసించునో వాఁడుమాత్రమే జ్ఞాని. తనయిచ్ఛలను కోరికలను విడిచి యెవ్వఁడీశ్వరేచ్ఛ ననుసరింపఁజూచునో వాఁడుమాత్రమే నిజమైన పండితుఁడు.

## 4 కార్యాచరణవివేకము.

లోకవదంతులనుబట్టియే విషయమును నిశ్చయింపఁ గూడదు. మనకుఁ దోఁచినట్లెల్ల యోచించుటయు సరిగాదు. ఈశ్వరసంబంధమునుబట్టి యోర్పుగలిగి జాగరూకతతో దానిని

జక్కఁగా యోజింపవలయును.

ఆహా! మనహృదయ మెంత దుర్బలమైనది. మంచి కన్నను చెడుగును సులభముగా నమ్మి లోకమునకు వెల్లడించుచుంటిమి. పావనజీవితమునం దభివృద్ధి జెందియున్న యుత్తమపురుషులు చెడువదంతుల నెంతమాత్రము విశ్వసింపరు. ఏలననఁగా మానవునియొక్క హృదయదుర్బలత్వము చెడ్డవిషయముల ముచ్చటించుటకు మిగుల సంతసించుచుండునని వారెఱుంగుదురు. కార్యాచరణమునందు వేగిరపాటు లేకుండుట బుద్ధిమంతుని యుత్తమలక్షణము. ఒరులు నమ్ముచున్నారను హేతువుచేత తానును దానిని నమ్మఁజూచుట పట్టియవివేకము. ఇతరుల యభిప్రాయములతో మూర్ఖముగా నేకీభవించుట బుద్ధిమంతునిలక్షణముగాదు. నీవు వినుచున్న ప్రతివిషయము నిజమని విశ్వసింపకుము. ఒకవేళ నీవుదానిని విశ్వసించినను వెంటనే దానిని లోకమున వెల్లడింపకుము. నీకుఁగలిగిన యభిప్రాయముల ననుసరించుటకంటె నీకన్న జక్కఁగాఁ దెలిసికొట్టియు విచారణశక్తిగలిగినట్టియు మేధావంతుల నడిగి తెలిసికొనుట మిగుల శ్రేయోదాయకము. ఈశ్వరోద్దేశము ననుబట్టి పావనజీవితము మానవుని నధికజ్ఞానవంతునిగాఁ జేయును. మంచియనుభవమును సహితము ప్రసాదించును. ఎవఁడు తనదృష్టికిఁ దానల్పుఁడుగాఁ గనుపించునో యాతఁడీశ్వరునికిఁ బరమవిధేయుఁడై యుండును అతఁడుమాత్రమే మంచి తెలివిగలిగినవాఁడు. అతఁడు చిత్తశాంతినొంది సుఖించును.

## 5 వే ద ప ఠ న ము.

సత్యము పావనమైన వేదమునందుఁ బ్రకాశించుచున్న దేగాని శ్రావ్యతరమైన కావ్యములయందు లేదు. ఎవనివలన వేదముత్పన్నమయ్యెనో వానిజ్ఞానముతో దానిని పఠింపవల యును. దానిని జదువునప్పుడు సూక్ష్మములైన వాదములను చర్చలను నపేక్షింపక నిజమైనలాభముఁ బొందుటకుఁ బ్రయ త్నింపవలయును. దానిని భక్తిభావముతోఁ జదువవలయును. భక్తిగలిగించెడి సులభమైన గ్రంథములను జదువవలయును.

గ్రంథకర్తల పాండిత్యవిశేషమును బాటింపక, పరిశుద్ధ మైన సత్యమునందలి యనురక్తిచేతనే వానిని జదువవలయును. దానిని వ్రాసినవారిని దెలిసికొనుటకుఁ బ్రయత్నింపనవసరము లేదు. అందు వ్రాయఁబడిన యంశములనుమాత్రము చక్కఁగా విచారించి తెలిసికొనుము. మానవులు గతించిరి. ఈశ్వర నియ మితములైన యందలి సత్యములుమాత్రము శాశ్వతములుగా బ్రకాశించుచున్నవి. మానవుల తారతమ్య వివక్షత లేకయే ఈశ్వరుఁడు మనకనేకవిధముల బోధించుచున్నాఁడు. వేదపఠన మునందు మనము సులభముగాఁజదివి గ్రహించఁదగిన భాగము లను తర్కించుటకును వాదించుటకును నపేక్షించి చదువునప్పు డు మనకు పెక్కుసంశయములు గలిగి చదువనీక యడ్డుపెట్టు చుండును. నీవందువలన లాభముబడయఁ గోరినయెడల సమ్రభావముగలిగి విశ్వాసముతో దానిని జదువుము. పాండిత్య

ముకొఱ కెన్నఁడును జనునకుము. సంశయములఁ దెలిసికొనుట కెంతమాత్రము వెనుదీయకుము. అందు మహాత్ములుపదేశించి నదానిని సావధానచిత్తుఁడవై మౌనముతో నాకర్ణింపుము అందు చెప్పఁబడిన విబుధవాక్యములయం దసూయతఁ జెంద కుము. వారు కారణములేకయే యట్టివిషయముల నచటనుడివి యుండరు.

## ౬ మోహము.

మానవుఁ డేపదార్థమునైన ననివార్యమైన కామముతోఁ గామించినప్పుడు చిత్తశాంతిని పోఁగొట్టుకొనుచున్నవాఁడగును దురాశాపరులైన గర్విష్ఠు లెన్నఁడును చిత్తశాంతిని బడయ నేరరు. నిజభావమునందడకువగలిగియున్న నిగర్వితులు మాత్ర ము నిరంతరము విశ్రాంతిగలిగి జీవించుచున్నారు. అహం భావమును బూర్తిగాఁజంపలేని మనుష్యులు తుచ్ఛములయిన నల్పవిషయములవలన సులభముగా నాకర్షింపఁబడుచుందురు. మనస్సునందు దుర్బలత్వముగలవారును, శరీరాభిమానమును విడిచిపెట్టలేనివారును కాలానుగుణ్యములైన యింద్రియవిష యములయందను రక్తిగలవారును ప్రపంచకోరికలనుండి మన స్సును మఱలించుకొననేరక మిగులబాధపడుచుందురు. అట్టివా రాకోరికలను విడువవలసివచ్చినప్పుడు మిగులవ్యసనముజెందు టయేగాక యెవరైన వారిని నిందించినప్పుడు వారికిఁబట్టరాని కోపముగలుగుచుండును. తనకోరికల ననుసరించినడుచుచున్న

యెడల పాపభీతి వానియంతరంగమునకు భారము గలిగించుచుం డును. తానాకోరికలకుం జిక్కియున్నందున వాఁడుపొందనపేక్షిం చుచున్న చిత్తవిశ్రాంతి వానికిలభింపనేరదు. కోరికలనుఅణచి పెట్టుటచేతనే నిజమైన చిత్తవిశ్రాంతి లభించుచున్నది. అంతి యేగాని అవి హృదయమున గదిరియున్నంతవఱకుఁజిత్తవిశ్రాం తి లభింపనేరదు. కనుక శరీరాభిమాని హృదయమునకు లవలే శంబైన విశ్రాంతిగలుగనేరదు. బాహ్యవిషయములయం దను రక్తిగలవారలకు నయితము చిత్తవిశ్రాంతి లభింపనేరదు. పర మార్థవిషయమునభిలషించుచున్న వారికిమాత్రమె యదిప్రాప్త మగుచున్నది.

## 7 అహంభావవిసర్జనము ఆశాపరిత్యాగము.

మనుష్యమాత్రులను సమస్తమైన వాఁడును సృష్టివిషయము లయం దాసక్తిగలవాఁడును నట్టి దుర్మార్గుఁడు. ప్రభువైన జీససు నిమిత్తమితరులను సేవింపవలసియున్నందునను లోకదృష్టికి నీవు హైన్యము గానుపించుచున్నందునను సిగ్గునొందకుము. నీ నిజశక్తిపైనెంతమాత్ర మాధారపడియుండక నీనమ్మకమునం తయు నీశ్వరునియందుమాత్రమే నిల్పియుంచుము. నీవుచేయ వలసియున్న దానిని జేయఁగలిగినంతవఱకుఁ జక్కగాఁజేయుము నీమంచిప్రయత్నములకు భగవంతుఁడనుకూలించి తోడ్పడును. నీ తెలివిని నీ జ్ఞానమాత్రము నమ్మకుము ఇతరమానవులప్రజ్ఞను సహితము విశ్వసింపకుము. ఈశ్వరానుగ్రహమును మాత్రమే

నమ్రుయుండుము. ఈశ్వరుఁడు దీనులరక్షించుటకును అహంభావనాపరత్వముచే గర్వించువారిని నడఁగఁద్రొక్కుటకును సమర్థుఁడు

నీవు ధనమును గలిగియున్నను దాని కానందింపకుము. స్నేహితులఁ గలిగియున్నను నందుకు సంతోషింపకుము. ఇవినీకు ప్రపంచమున గొంతవఱకానుకూల్యమును మాత్రము గలిగించును. సర్వమును నీకనుగ్రహించుచున్న యీశ్వరసాన్నిధ్యమునకు మాత్రమే నీవుసంతోషింపుము. నీయౌన్నత్యమునకును నీసౌందర్యవిశేషమునకును నీవుగర్వింపకుము. ముదిమియు వ్యాధులును నీసుందరాంగంబు నాకర్షించి నిన్ను కురూపినిగాఁ జేయఁగలవు. నీప్రజ్ఞాసామర్థ్యములఁగూర్చి యుప్పొంగకుము. అందుమూలమున నీశ్వరానుగ్రహమునకు దూరమై మనకు స్వాభావికముగా దయచేయఁబడిన శక్తిసామర్థ్యములను సహితము పోఁగొట్టుకొనవలసియుండును. ఇతరులకన్న నీవు మంచివాఁడవనిభావింపకుము. మానవహృదయములఁ గనిపెట్టిచూచుచున్న భగవంతుని దృష్టిపథమునందు నీవ యోగ్యుఁడవై యుండవచ్చును. నీవుమంచికార్యము జేయుచుంటివని విఱ్ఱవీగకుము. ఈశ్వరోద్దేశము మానవాభిప్రాయములను తఱుచు భేదించుచుండును. కనుక నీకు మంచిదని తోఁచుచున్నవిషయము లీశ్వరదృష్టికి చెడుగులుగాఁ గనుపింపవచ్చును. కనుక నీయందేదియైన మంచియున్నదని భావించితివేని అంతకన్న నెక్కువయోగ్యత యితరులయందు సంయుతముగలదని తెలిసికొనుము. ఇందువలన నీ

హైన్యభావమును భద్రపఱచుకొనఁగలవు. ఇతరులకన్న నిన్ను తక్కువగా భావించుకొనుచున్నందున నీకు లేశంబైన బాధ కలుగనేరదు. ఒకనికన్న నీవెక్కువవాఁడవని భావించుకొనుటచే తనే యధికప్రమాదము సంభవించుచున్నది. దీనులహృదయ మెల్లప్పుడును తెంపులేని విశ్రాంతిని గలిగియుండును. గర్వితుల చిత్తమెప్పుడును కామక్రోధాదులచేతను మదమాత్సర్యముల చేతను నెడతెగక కలతజెందుచుండును.

## 8 అమితపరిచయవిసర్జనము.

నీహృదయము నెవ్వరికిని దెఱచి చూపకుము. భగవద్భక్తిగలిగిన యుత్తమపురుషునకు మాత్రమే నీస్థితిని విశదపఱచుము. నీ వెల్లప్పుడు బాలప్రాయుల సంఘము నందును నపరిచితుల సంఘమునందును నిలువకుము. గొప్పవారి సన్నిధానమునకుఁ జనప్రయత్నింపకుము. ధనవంతుల యనుగ్రహముబడయ నపేక్షింపకుము. ఉత్తమ ప్రవర్తనగల భక్తిపరులతోను నిష్కపటహృదయులైనయనసూయకపుజనులతోను స్నేహింపఁ బ్రయత్నింపుము. మహత్తరమైన విషయములను మాత్రమే సంభాషించుచుండుము. స్త్రీజనంబులతో నధిక పరిచయము గలిగియుండకుము. కాని పావనస్వభావముగల యుత్తమకాంతల నీశ్వరసేవకుఁ బ్రేరేపింపుము. మానవపరిచయమును విడిచి యీశ్వరసమాగమమును మాత్రమే నభిలషింపుచుండుము. దానధర్మముల నెల్లనియెడల నాచరింపవచ్చును. యుక్తాయుక్త

పరిజ్ఞానమునువిడిచి యాచరించుట శ్రేయము గాదు. కొన్ని సమయములయందు మనకింతవఱకు పరిచయములేని మనుష్యుఁడు సుప్రసిద్ధమైన పేరుకీర్తులవడసియున్నను నాతడు మనల సమీపించినప్పు డాతనిసమక్షమును మన యభిప్రాయములయందు వానికి న్యూనతను గలిగించుచుందుము.

ఇతరులు మనతో మైత్రిని గలిగియున్నప్పుడు వారిని మన మనుకూలించుచుందుము. కాని వారు మనయందు లోపములను కనిపెట్టినప్పుడు వారు మనల గర్హించుచుండుటచే వారల మనము ప్రతికూలించుచుందుము.

## 9 వినయము, విధేయత.

నీకునీవు స్వతంత్రుఁడవై యుండుటకంటె నితరులకు లోఁబడియుండుట మిగుల లాభకరము. ఒకరిని తాను లోఁబఱుచుకొనుటకంటె తానొకరికి లోఁబడియుండుట క్షేమకరమైన విషయము. అనేకులు బుద్ధిపూర్వకముగా గాక యవసరమును బట్టి యితరులకు లోఁబడుచుండిరి. అందువలన వారిమనస్సులకుఁ గొంచెము నొప్పి గలిగినప్పుడు అది వారికి కష్టతరముగాఁ గనిపించి పలవించుచుందురు. కావున వారిమనస్సులకు స్వాతంత్ర్యమొకింతయుఁ గలుగుచుండలేదు. మనయిచ్ఛలను నీశ్వరేచ్ఛకు లోఁబఱచిననేతప్ప యట్టి స్వాతంత్ర్యము మనకెన్నఁడును గలుగనేరదు. నీవెచ్చటకుఁ బరుగులిడినను చిత్తవిశ్రాంతి నీకు లవలేశంబైన గలుగనేరదు. నిన్ను పరిపాలించుచున్న పరిపాల

కుని యనుజ్ఞకు లోఁబడియున్నప్పుడు మాత్రము నీవు చిత్తశాంతిని బొందఁగలుగుచుంటివి. ఒకతావునుండి మఱియొకతావును జేరఁదలచుచుండుటచే ననేకులు భ్రష్టీకరించిరి. మానవులందరును తమతమభావములను ననుసరించుచుందురు. తమభావములతో నేకీభవించియున్న యితరుల భావములను నభిప్రాయములను నంతకన్న నెక్కువగా పరిగణించుచుందురు. మన మెల్లప్పుడు భగవంతునితో నేకీభవించియున్నయెడల మనభావములను యోజనలను వాని కర్పించుచుందుము. అందువలన మనము చిత్తవిశ్రాంతిని బ్రసాదింపఁబడుదుము. సర్వమును పూర్ణముగా నెఱిఁగియున్న బుద్ధిమంతుఁడెవ్వఁడు? కనుక నీబుద్ధిని నీవధికముగా విశ్వసింపక యితరులు చెప్పుచున్నదానిని జాగరూకుఁడవై వినుచుందుము. నీయభిప్రాయములే నీకెక్కుడు సుఖదాయకములుగా గనుపించుచున్నప్పుడు వానిని భగవంతునికొఱకు విసర్జించి యితరుల యభిప్రాయములను సహింపుము. అందువలన నీవధ్యాత్మికాభివృద్ధి బొంది సుఖింపఁగలవు. ఇతరుల కుపదేశించుటకంటె యుపదేశములను తాను వినుటయే శ్రేయస్కరమని పెద్దలవలన ననేకమారులు వినియుంటిని. ఎల్లరియభిప్రాయములును భావములును మంచివియైయుండవచ్చును. అట్టివిషయములో సహేతుకమని తలఁచినప్పుడును యితరుల యభిప్రాయములయందనిష్టము గలిగియుండుట గర్వమునకును మౌఢ్యమునకును చిహ్నమని నెఱుంగవలయును.

## అధిక ప్రసంగము.

లౌకిక వ్యాపారములచే తీరిక లేక బాధపడుచున్న జన సమ్మర్దమును సాధ్యమైనంతవఱకు విడిచిపెట్టుము. వారు సదుద్దేశముతో సంభాషించుచున్నను వారిసంభాషణలు లౌకిక సంబంధములై యుండుటచే నవి మనయభివృద్ధికి మిగుల ప్రతిబంధకములై యుండును. వారిసంభాషణావిషయముల వినుటవలన తద్విషయమాలిన్యము మనహృదయములనయితము నంటి మనల భ్రష్టీకరింపఁజేయును. నేను తఱచు జనసంఘమును విడిచి యొంటరిగా మౌనముతో నుండఁగోరెదను. మనము తఱచు సంభాషించుచు నాసక్తిచే ప్రసంగములయం దేల ప్రవేశించుచుందుము? మనము ప్రసంగింపఁజొచ్చినప్పుడు మనస్సున నొప్పిగలుగువఱకు దానిని విడిచిపెట్టుట లేము. మనము తఱచు సంభాషింపనుద్యమించుటకు కారణము దీర్ఘప్రసంగమువలన నొకరినొకరుల్లసింపఁజేయుటకును ననేక యోజనలతో విసిగియున్న హృదయమునకు విశ్రాంతిగలిగించుటకును గనుక మనము ప్రేమాస్పదములైన విషయములను గూర్చియు నాసక్తి గలపదార్థములఁ గూర్చియు బాధకరములుగాఁ దోఁచుచున్న యంశములఁ గూర్చియు తఱచు సంభాషించుచుందుము. అందువలన మనకుఁ గొంత యుపశమనము గలుగునని తలంచుచుంటిమి. అయ్యో! ఇది యెంతనిరర్థకము! ఇది మిగుల నిష్ప్రయోజనమైనది. ఈ బాహ్యోపశమనము హృదయమునందలి

పారమార్థిక భావముల కనేకమైన నష్టమును గలిగించుచున్నది. ప్రాల్మాలి నిరర్థక ప్రసంగములయందు ప్రొద్దుపుచ్చుటకు బదులుగా జాగరూకతతో భగవంతుని ధ్యానించుచు తన్నామకీర్తనంబున కాలంబుగడుపుట యెంతయుచితము! నీవు సంభాషించుటయే యవసరమని తోఁచినప్పుడు శాశ్వతజీవనమునకు సాధనములైన విషయములనుమాత్రమే ప్రశంసించుచుండుము. ఆత్మాభివృద్ధిని బాటింపక చెడ్డపద్ధతులనవలంబించి యిష్టమువచ్చినట్లు సంభాషించుచుంటిమేని యజాగ్రతాప్రలాపములు ప్రబలింపవలసివచ్చును. పారమార్థిక విషయముల నొకరితో నొకరు సంభాషించుచుండుటవలన పావనత్వమునం దభివృద్ధిఁ జెందఁగలుగుదుము. ఏకవిధమయిన మనస్సులుగలవారును భావములుగలవారును మఱి విషయములయం దన్యోన్యులై యుండుటకిదియే ముఖ్యకారణము.

## చిత్తవిశ్రాంతి — ఈశ్వర వాత్సల్యమునం దభివృద్ధి జెందుట.

జోక్యముమాలిన యితరుల వ్యాపారములగూర్చియు సంగతులనుగూర్చియు సంభాషింపక వానిని విసర్జించితిమేని మనము వలయునంత చిత్తవిశ్రాంతిని గలిగియుండుము. ఇతరుల విషయములయందు ప్రమేయము గలుగజేసుకొనుచున్నప్పుడును, ఇతరుల నరయ ప్రయత్నించునప్పుడును చిత్తవిశ్రాంతి యెట్లుగలిగియుండుము. లోకతంత్రములయందు నైపుణ్యములేని యమాయక జనులు నిజముగా నదృష్టవంతులు.

ఎందుచేతననఁగా వారిమనస్సులవైకల్య మొకింతయు నంటకుండుటచే వారిహృదయ మధికవిశ్రాంతిని బడయఁగలిగియుండును. మునిశిఖామణులందఱును ధ్యానమననిదిధ్యాసములం దంత పరిపూర్ణులై యుండుటకుఁ గారణమేమి? వారు ప్రపంచ విషయానురాగమును బూర్తిగా నివృత్తిఁజెందియుండుటచేఁ దమచిత్తంబును నీశ్వరాయత్తంబు జేయఁగలిగియుండిరి. అందువలన నిజహృదయములఁ జక్కఁగా విమర్శించుటకు వలయునంత సావకాశమును గలిగియుండిరి. మనము విషయాదులయందు మునిఁగి యింద్రియపరాయణత్వముచే క్షణభంగురములైన యశాశ్వతపదార్థముల నభిలషించుచుంటిమి. మనయందు నున్న స్వప్రదోషము నైనను పూర్తిగా నివారించుకొనలేక పోవుచుంటిమి. మనము దినదినాభివృద్ధికొఱకు తగినంత ప్రయత్నమైనను జేయలేక పోవుచుంటిమి. తుదకు మనము నిరర్థకజీవులమై చెడుచుంటిమి.

మనయెడల మనము కచ్చితముగా నున్నప్పుడు బాహ్యవిషయములకు నంటకున్నప్పుడు పారమార్థికవిషయములను జవిజూడఁగలిగియుందుము. బాహ్యవిషయముల నెంతమాత్రముఁ దగులక యాత్మవిషయముల నరయఁబ్రయత్నించుటవలన పరమార్థమును దెలిసికొనఁదగిన యనుభవమును గలిగియుందుము. పారమార్థికజ్ఞానమునకుఁ బ్రతిబంధకమైనవిషయ మొకటిగలదు. అది యింద్రియపరాయణత్వము. దీనిని మనము విడిచిపెట్టలేక పోవుటచేతనే మహాత్ములందఱు ప్రయత్నింపఁగలిగినట్లు పర

పూర్ణత్వమును కనిపెట్టఁబ్రయత్నింపలేకపోవుచుంటిమి. పరిపూర్ణత్వమున నభివృద్ధిజెందలేకపోవుచుంటిమి.

అట్టియోజన మనహృదయమున నెప్పుడైన నొకప్పుడు పొడసూపఁగలిగినను మన మింద్రియపరాయణత్వముచే దానిని మనము చెడఁగొట్టుకొని మనహృదయశుద్ధిని శోధించుటకుఁ దటస్థమగుచున్న ప్రతిస్వల్పవిషయమునందును పరీక్షకు నిలువలేక మానవులయుపశమనంబునకు శరణుఁజొచ్చుచుందుము. ధీమంతులవలెనే మనమును పరిశోధనాకదనరంగముల యందు ధైర్యసాహసములతో నిల్చియుండఁగలిగితిమేని పరమేశ్వరునిసహాయమును నిశ్చయముగా మనము పొందఁగలుగుదుము. మనము నిగ్రహసామర్థ్యమును గలిగియుండుటకుగాను మనోవికారహేతువులను సృజించియున్నపరాత్పరుఁడు తనయనుగ్రహమును పూర్ణముగా నమ్మి యావికారహేతువులను సాధింపఁబ్రయత్నించుచున్నవారికి సహాయము చేయుచుందును. మతమునందలియభివృద్ధి బాహ్యాచరణమునందు మాత్రమే యుంచఁబడినయెడల మనయాధ్యాత్మికజీవితము త్వరలో ముగియుచుండును. అందువలన మనహృదయమునకు నిష్కామత్వముగలిగి నిర్మలముగాజాలదు. వృక్షము మూలముతో ఛేదింపఁబడిననేతప్ప దానిశాఖలు మొదలంట నశించునట్లు మనస్సును గుదియించిననేతప్ప దానియందలికోరికలు నశింపవు. కోరికలునశించినప్పుడుమాత్రమే మనము మనశ్శాంతిని గలిగియుందుము. మిగుల శ్రమపడి సంవత్సరమున కొక్క

దుర్గుణమును మనస్సునుండి పాఱఁదోలఁగలిగినను పరిపూర్ణ మైనయుత్తమజీవితము నందువలయునంత యభివృద్ధి జెందఁగలము. కాని యిందుకు వ్యతిరేకముగా మతజీవితముయొక్క ప్రారంభమునం దిప్పటికన్న నెక్కుడుపరిశుద్ధముగాను యోగ్యముగాను నుండియుంటిమి.

మతావేశమును పట్టుదలయు నొకరోజుకన్న నొకరోజ యభివృద్ధిజెందుటకుబదులుగా నవి క్రమక్రమముగా క్షీణించుచున్నవి. కాని ప్రారంభమందు మనముగలిగియున్న యావేశములో నిపుడు సహస్రాంశమైన నెవరైన గలిగియున్నయెడల యదిరేయొక గొప్పయోగ్యతగా పరిగణింపవలసియున్నది. ప్రారంభమున మనయెడల మన మించుక కాఠిన్యమును వహించఁగలిగినయెడల తుదకు సౌలభ్యముతోను సంతోషముతోను నెల్లకృత్యములను నిర్వర్తింపఁగలిగి యుందుము. ఇంతవఱకు మనమలవాటుపడియున్న చెడుగుణములు విడిచిపెట్టుట మిగుల ప్రయాసకరము. మనయిచ్ఛకు వ్యతిరేకముగా నడువగలుగుట యంతకన్న నెక్కుడుప్రయాసకరము. స్వల్పవిషయము లించుక నీవు జయింపలేనియెడల నంతకన్న నెక్కుడుప్రయాసకరము లయినవిషయముల నీ వెట్లు జయింపఁగలవు? చెడుతలంపు హృదయమున బొడసూపుచున్నప్పుడే దానిని నడఁచిపెట్టుము. దురభ్యాసములను దుర్గుణములను విడిచిపెట్టుము. లేనియెడల ముందవి గాఢముగా నిన్ను బంధింపఁగలిగియుందును. నీవు దేనిని జేయుటవలన నధికమైన చిత్తవిశ్రాంతిని

గలిగియుందువో యితరుల కది క్షేమకరముగా నుండునో దానిని నీవు తెలిసికొనఁగలిగిన యెడల నీ వధ్యాత్మికాభివృద్ధియం దధిక ప్రసక్తి గలిగియున్నట్లు భావించెదను.

## 11 కష్టములవలన గలుగులాభము.

కొన్నిసమయము లయందు మనకు బాధలును కష్టములును దటస్థించుచున్నవి. అట్లు తటస్థించుట మనకు క్షేమకరమే. ఇందువలన మనశక్తి మనకు విదితమై యైహికవిషయములయందు నిస్పృహాత్వమును గలిగియుందుము. ప్రపంచపదార్థముల నాశింపము.

మనము చక్కఁగా బ్రవర్తించుచున్నను కొన్నివిషయములయందు మన కసంగతములు సంభవింపవచ్చును. అవమానములను తిరస్కారములను ననుభవింపవలసివచ్చును. అయినను మనకవి శ్రేయోదాయకములే. అందువలన నమ్రభావములవరుటయే గాక గర్వమునుండియు నహంభావమునుండియు కాపాడఁబడుచుందుము. మనము మానవోపశమనముల నెంతమాత్రము పాటింపక భగవంతునియందుమాత్రమే విశ్రమించియుండవలయును. కనుక బుద్ధిమంతుడైనవాఁడు తనకు కష్టములును బాధలును తటస్థించినప్పుడు దురాలోచనలును దుర్భావములును మనస్సు నాక్రమించుచున్నప్పుడు భగవంతుని యావశ్యకమును కనిపెట్టగలుగుచుండును. అట్టి సమయములయం దాయనయనుగ్రహముతప్ప వేఱుగతి యేదియు

లేదని మనము తెలిసికొనగలుగుదుము. మానుషస్థితికి మనము పరితపించి కష్టములనుండి యుద్ధరింప నీశ్వరుని వేడుకొనుచుందుము. ఇంతియగాక మనకు కష్టము లతిశయించుచున్నందున ప్రాపంచిక జీవితమునందు విసుగుజెంది మృత్యువుకొఱకు నిరీక్షించుచు పరలోకమున క్రీస్తుతో నివసింపగోరుచుందుము. పరిపూర్ణమైనరక్షణమును సంపూర్ణమైన చిత్తవిశ్రాంతియు నీలోకమున బడయఁగలుగుట యసంభవమని తెలిసికొనఁగలుగుదుము.

## 12 మనోవికారనిరోధనము

మనము ప్రపంచము ననుసరించుచున్నంతవఱకు కలవరములు మనోవికారములును గలుగక మానవు. ఇందుచేతనే నేనొకానొక (Job) భక్తవరుఁడు తనగ్రంథమునందు మానవజీవిత మీలోకమున ననేకవికారములతోఁ గూడియున్నదియని వ్రాసియుండెను. వికారపిశాచ మించుకయు నిద్రజెందక యెవనిని మ్రింగుదునా యని సదా తిరుగుచున్నది. కనుక ప్రతివాడును మనోవికారహేతువులను గనిపెట్టి యాపిశాచమునకుఁ జిక్కకుండుటకు భగవంతుని ధ్యానించుచుండవలయును. ఈవికారములచే కొన్నిసమయములయందైనను ముట్టింపబడని పవిత్రహృదయము లంతగాఁ గనిపించవు. మానవమైనను మనోవికారములనుండి పూర్తిగా విముక్తిజెందలేకపోవుచుంటిమి. మనోవికారములు నిజస్వభావమునందున్న మనకు దుఃఖకరములై

యున్నను మఱియొకవిధముగా నవి మనకు లాభకరములే. వానిని నిగ్రహింపఁగలిగినప్పుడు మనస్సునకు దృఢత్వమును పావనత్వమును సంభవించుచున్నవి. ఈమనోవికారహేతువులనుభరింపలేనివారు చెడిపోవుచుండిరి. మనోవికారహేతువులచేతను కష్టములచేతను నావరింపఁబడని ప్రదేశ మేదియుఁ గనిపించదు. మనోవికారములును బాధలును గలుగఁజేయని వ్యాపారము లేవియు లేవు. లోకములోని వ్యాపారములన్నియు వీనికాస్పదములై యున్నవి. మనోవికారములనుండి పూర్తిగా విముక్తిఁ జెందగలిగినమానవుఁడెవ్వఁడు కనిపించఁడు. హృదయముయొక్క యపావనస్వభావమునుబట్టి యీవికారములన్నియు మనయందే పుట్టుచున్నవి. ఈవికారములు యొకదానివెంబడి యొకటి తటస్థించుచున్నవి. వీనినుండి తమహృదయమును రక్షించుకొనుటకు తత్కారణములైన విషయములను విడిచిపాఱిపోవుటయే సాధనమని కొందఱు భ్రమించుచుండిరి. ఇందువలన వారీవికారములకుఁ జిక్కి మఱింత బాధపడుచుండిరి. మనోవికారములకు హేతువులయిన విషయముల విడిచి దూరముగా తొలఁగియున్నంతమాత్రముచేత నవి మనహృదయములనుండి తొలఁగనేరవు. ఓరిమిగలిగి నమ్రభావముతో వానిని భరించియుండుటయే వానిని జయింపఁగలిగిన యుత్తమసాధనము.

ఇందుమూలమున మనలబాధించుచున్న శత్రువులకన్నను మనమధికబలాఢ్యుల మగుచుంటిమి. ఈమనోవికారములకు లోనుగాకుండుటకు మఱియొకసాధనము గలదు. అదిమన

స్సుయొక్క యుద్రేకమును నశింపఁజేయుటయే. అందువలన మనస్సు నేవికారమంటనేరదు. అంతియేగాని మనోవికారముల కనుగుణ్యములయిన బాహ్యవిషయములను విడిచినంతమాత్ర ముచేత నవి నశింపనేరవు. మనస్సుయొక్క యుద్రేకమును నడఁచిపెట్టకయే యందుకుకారణములైన బాహ్యవిషయముల విడిచిపెట్టుటవలన కొంతవఱకు లాభముగలిగియున్నను నది సరియైన యాత్మాభివృద్ధి గానేరదు. బాహ్యములైన వికార హేతువులను విడిచిపెట్టినను యావికారము లంతరంగమును నాశ్రయించియుండుటచే పూర్వముకన్న నెక్కుడు సత్తువతో బాధించుచుండును. ఈవికారహేతువులకుఁ గ్రమక్రమముగా నలవాటుపడి యోపికగలిగి దీర్ఘకాలము వానిని సహించియుం డుటచేతను యీశ్వరధ్యానముచేతను మనమనోవికారములను పూర్తిగా నిర్జింపఁగలము. ఈవికారములు నీమనస్సును బా ధించుచున్నప్పుడు చక్కని యుపదేశములఁ బరిగ్రహింపుము.

మనోవికారములచే బాధింపఁబడుచున్నవారిని నీవెన్న డుద్వేషింపకుము. నిన్ను నీవుపశమించుకొనినట్లు వానినిసయి తముపశమింపఁజేయుము. చిత్తమునకు నిశ్చలత్వములేకపోవుట చేతను భగవంతునియందు నమ్మకము లేకపోవుటచేతను మా నవహృదయము లీవికారములచే బాధింపఁబడుచున్నవి. చు క్కానిలేని నావ సముద్రతరంగములచే ముందువెనుకలకు నీడ్వ బడినట్లు స్థిరత్వములేని చిత్తము పెక్కువికారములచే ననేక విధముల నాకర్షింపఁబడుచుండును. అగ్నిబంగారముయొక్క

పరిశుద్ధ, కల్మషములను బుజువుఁజేయుచున్నట్లు వికారహేతువులు మానవునియొక్క యోగ్యాయోగ్యతలను లోకమునకు వెల్లడించుచున్నవి. వికారము మనస్సున బాధసూపిన తరుణముననే దానిని గనిపెట్టఁగలిగినయెడల యీశత్రువును మనము మాత్రముగా జయింపఁగలుగుదుము. ఈవికారములు హృదయమున సంచరించుచున్నప్పుడు దానిని పైకిఁ దలఁజూపనీక పెఱికివైచినయెడల నది హృదయమునఁ బాదుకొననేరదు. "రోగము శరీరమునఁ బొడమినవెంటనే దానినడ్డుపెట్టవలయును. దానిని నుపేక్షించి వైద్యుఁడు వచ్చువఱకుఁ గాలయాపనముజేసినయెడల యది శరీరమునందు వ్యాపించును" అని బుద్ధిమంతుఁడు వ్రాసినసంగతిని జ్ఞప్తికిఁదెచ్చుకొనుము. ఈవికారము ప్రారంభమున నొకచిన్నసూచనగాహృదయమున నుదయించును. తరువాత నది గొప్పయాలోచనగా పరిణమించి యానందరసముతో విలిపిరియుచుండును. తుదకది దుర్మార్గమున బ్రబలి మోహానురాగములఁ బుట్టించుచుండును. ఈపాపిష్ఠి శత్రువిట్లు క్రమక్రమముగా విజృంభించి మనస్సును వశపఱచుకొనుచున్నది. ప్రారంభములో మనము దానిని నణఁచిపెట్టకపోవుటచేతనే యది యిట్లు విజృంభింపఁగలుగుటకుఁ గారణమగుచున్నది. మనసుయొక్క బిగివీడినకొలదిని మానవుఁడంతకంతకు మగటిమిచెడి బలహీనుఁ డగుచుండును. మనస్సుయొక్కబలము క్షీణించినకొలదిని దానిశత్రుబల మతిశయించు

చుండును. కొంద ఱధ్యాత్మికజీవితమున కాదియందు మనో వికారములచే మిగుల బాధింపఁబడుచుందురు. కొందఱంత మందు బాధింపఁబడుదురు. మఱికొందఱు జీవితకాలమంతయు బాధింపఁబడుదురు. కొంద ఱీశ్వరుఁడు తమకు దయచేసియున్న జ్ఞానమునుబట్టియు ధర్మబుద్ధినిబట్టియు మనోవికారములమూలమున స్వల్పముగా బాధింపఁబడుచుందురు. ఈమనోవికారము లీశ్వరరాజ్యమునకుఁ బ్రతిబంధకములై యున్నను వానిని నిర్జించి యీశ్వరరాజ్యము ననుభవింపఁదగిన సాధనము లీశ్వరునివలననే యేర్పాటుచేయఁబడియున్నవి. కావున మనోవికారములు మనకు సంభవించుచున్నప్పుడు మనము నిరాశఁజెంద నవసరములేదు. మనకు భంగపాటులును కలవరములును తటస్థించినప్పుడు వానినుండి తప్పించుకొనుటకు నీశ్వరసేవతప్ప వేఱుసాధనమేదియుఁ గనుపించదు. ఇట్లనే మనోవికారములు మనల బాధించుచున్నప్పుడు వానినుండి విముక్తిఁజెందుటకు నీశ్వరోపాసనము ముఖ్యసాధనము. "మనోవికారముల నేర్పరచిన భగవంతుఁడు వానిని నిరోధించుటకుఁ దగిన సాధనములను సయితమేర్పరచి యుండెను." అని "సెంటుపాల్" అను రొక పరమభక్తుఁడు నుడివియుండెను. కనుక నీకు సంభవించుచున్న ప్రతిమనోవికారమునందును సమ్రిభావముతో నీచిత్తము నీశ్వరాయత్తముజేయుము. భావమునందు నమ్రుఁడై యున్న వానిని నీశ్వరుఁడు తప్పక నుద్ధరించును.

మనోవికారహేతువులవలనను, బాధలవలనను మానవుని యాత్మాభివృద్ధి శోధింపఁబడుచున్నది. అందువలన వాఁడు పొందఁగోరుచున్న సత్కారమునయిత మతిశయించుచున్నది. వానియోగ్యత లోకమునకు ఋజువుచేయఁబడుచున్నది. కష్టములును పరీక్షలును తటస్థించనంతవఱకు మానవుఁడీశ్వరుని యందు భక్తివిశ్వాసములుగలిగియుండుట యొకఘనకార్యము గాదు. కష్టసమయములయందును పరీక్షసమయములయందును నీనిదానమంతయు నీశ్వరునియందు నిలిపి యోరిమితో వానిని భరించుచు నీశ్వరేచ్ఛననుభవింపఁజూచుటయే నిజమైనభక్తిభావముయొక్క యాధిక్యము. అప్పుడు నీవు మతమునందు దగినంత యభివృద్ధిజెందియున్నట్టు తెలుసుకోఁబడుదువు. భగవంతునియెడల నిట్టినిరూఢముగలిగినవారుమాత్రమే మనోవికారములనుండి సంరక్షింపఁబడుచుండిరి. కొందఱు మనోవికారములనుండి తమ్ము తాము కాపాడుకొనఁబ్రయత్నించుచుండియు ప్రతిదినము సంభవించుచున్న స్వల్పములకు లోనగుచుండిరి. కనుక వారు వినమ్రులయి స్వల్పవిషయములయందు నయితము తమ మనోదుర్బలత్వమును కనిపెట్టి గొప్పవిషయములయందు తమ రెంతమాత్రమునైతికులుగానట్టు భావించుచుండిరి.

## 13 వేగిరపాటు.

నీదృష్టియంతయు నీయందుమాత్రమే నిలుపుము. ఇతరులగుణములను చేష్టలును విమర్శింపక విడిచిపెట్టుము. పరుల

వ్యాపారము లిట్టివని చెప్పుకొనుటవలన ప్రయోజనము లేదు. ఇతరుల వ్యాపారములయందలి మంచిచెడ్డలను విమర్శించుటలో నీవు వేగిరపడుచుందువు. అందువలన నీకు పాపము సంభవించును. ఇతరులను విమర్శించుటకంటె తమ్ము తాము విమర్శించుకొనుటయు విచారించుకొనుటయు మిగుల క్షేమకరము. మనయిష్టము ననుసరించి మనవిచారణ నడుపబడుచుండును. న్యాయవిచారణ పక్షపాతములవలన భ్రష్టీకరించుచుండును. మనము చేయుచున్న వ్యాపారములన్నిటియందు భగవత్ప్రీతినిమిత్తము మన పరిశుద్ధభావమును గలిగియున్నయెడల మనయుద్దేశములకు విరోధము సంభవించినప్పుడు సయితము కలతనొందనేరము. విషయముయొక్క యథార్థస్థితిని నిశ్చయించుటలో పక్షపాతము, అసూయత మొదలగునవి స్వతస్సిద్ధముగా హృదయమున జనించుటవలనగాని యితరులు చెప్పినమాటలను విశ్వసించుటవలనగాని మనము తప్పుత్రోవను బడుచుందుము. కార్యాచరణమునందనేకులు స్వార్థపరులై యుండియు తమస్వార్థపరత్వమును గుర్తింపకయే తమలాభమును, యానందమును బడయనపేక్షించుచుండిరి. వారు కార్యములు తమయిచ్ఛానుసారముగా జరుగుచున్నంతవఱకు మనస్సంతుష్టిని బొందుచుండిరి. కాని యవి తమకు బ్రతికూలముగా సంభవించుచున్నప్పుడతిశీఘ్రములో కలవరము జెందుచుందురు. భావములును, అభిప్రాయములును వేఱువేఱుగానుండుటచే స్నేహితులయందును

మతస్థులయందును, దైవారాధికులయందును, కలతలును, వై
రములును సంభవించుచున్నవి. పూర్వమునుండియు నలవడి
యున్న యలవాటును విడిచిపెట్టుట బహుప్రయాసకరము.
స్వకీయములయిన యభిప్రాయములకును భావములకును మనః
పూర్వకముగా వ్యతిరేకించి నడువగలిగినవారెవ్వరును లేరు.
యేసుక్రీస్తునకు నిన్ను లోబఱచెడుశక్తికన్న నీస్వకీయ హేతు
విచక్షణశక్తిమీఁదను, ఆలోచనమీఁదను, ప్రయత్నముమీఁ
దను నాధారపడుచున్నయెడల నీవధ్యాత్మిక జీవితమునందభివృద్ధి
జెందుటకు దీర్ఘకాలమవసరముగలిగియుండును. మనమన్నియె
డలను భగవంతునికి బరమవిధేయులమై సంచరించుచుండుట
భగవత్సంకల్పము. మనహృదయము వానిప్రేమచే రవులుకొ
ల్పఁబడుచున్నయెడల మానవునికిని యమితమైయున్న హేతు
విచక్షణశక్తియొక్క హద్దును నతిక్రమింపఁగలము.

## 14 ధర్మకార్యములు.

మానవునియందు మనకుగలప్రేమను బట్టిగాని లేక
మఱియేయితరవిషయముకొఱకు గాని చెడుగునెన్నఁడును చేయఁ
గూడదు. ఆకార్యము కానొకనికి నవసరమైయుండవచ్చును.
అది వానికి లాభకరమగుటచే నది స్వతస్సిద్ధముగా చెడ్డకార్య
మైనను మంచికార్యముగానే కనుపింపవచ్చును. అయినను నొక
నికి లాభముగలుగుచున్నంతమాత్రముచేత చెడుకార్యము
నెన్నడును జేయరాదు. అందువలన వానికి మంచిచేయుట లేక

పోతినని నీకు జిజ్ఞాసగలిగినయెడల యామంచివానికి న్యాయమైన మఱియొకవిధముగా గలిగింపుము. అప్పుడు నీవు మంచికార్యమును జేయక విడిచిపెట్టినవాఁడవుగావు. అప్పుడు నీవెక్కువ మంచికార్యమును జేసినవాఁడవగుదువు. దానధర్మము శూన్యమైనప్పుడు బాహ్యవ్యాపారమెట్టిదైనను నిరర్థకము. ధర్మబుద్ధితోఁ జేయఁబడిన దానము లేశమాత్రమైనను తృణీకరింపఁబడక సత్ఫలదాయకంబై యధికంబుగాఁ గొనియాడఁబడుచుండును. దానము జేయఁబడిన పదార్థముకంటె దాతయొక్క హృదయశుద్ధి యధికముగా పరిగణింపఁబడుచుండును. పాత్రత నెఱిఁగి తనకు శక్తిగలిగినంతవఱకు దానముచేయువాఁడును మిగుల పరిశుద్ధమైన ప్రేమతో దానముచేయువాఁడును తనయిచ్చునెంతమాత్రము ననుసరింపక లోకహితార్థము దానముజేయువాఁడును మహాదాతలని చెప్పఁబడుదురు. నిజముగా ప్రాకృతములయిన పెక్కుకార్యములు ధర్మబుద్ధివలన బయలువెడలుచున్నట్లు కనుపించి దానములని భ్రమింపఁజేయుచున్నది. కొన్నిదానములు పేరుకీర్తులనిమిత్తమును స్వలాభము నిమిత్తమును తమయానందము నిమిత్తము నాచరింపఁబడుచున్నవి. నిజమైన నెఱదాత తననిమిత్తమెంతమాత్రము యోచింపక సర్వకార్యములయందును భగవత్ప్రీతినే కోరుచుండును. అతఁడెవరియందును ద్వేషబుద్ధిని గలిగియుండఁడు. తనసుఖము నందించుకయు నానందింపఁడు. ఉత్తమకార్యములన్నిటికన్నను భగవంతునియందు తానానందించు

టకుఁ గోరుచుండును. ఆతఁడు మంచి నించుకయు మానవు నియం దారోపించుటలేదు. ఎవనియందు మహాత్ములు తాము పొందవలసియున్న ఫలమును కనిపెట్టియుండిరో భక్తవరులందఱును సదా యెవనియందు విశ్రమించుచుండిరో, సర్వవిషయములు ఎవనియందు పుట్టుచున్నవో యట్టి పరమాత్మను సర్వము నారోపించుచుండును. నిజమైన ధర్మబుద్ధి యణుమాత్రమెవ్వరికైన గలిగియున్నయెడల, ప్రపంచవిషయములన్నియు వానికి నిరర్థకముగా గనుపించును.

## 16 పరులలోపములను సహించుట.

తనయందలి లోపములనుగాని పరులయందలి లోపములనుగాని తాను చక్కదిద్దుకొనఁజాలనప్పుడు భగవంతుఁడు వానిని జక్కదిద్దువఱకు నోరిమితో భరింప నేర్చుకొనవలయును. అట్లు భరింపనేర్చుకొనుట మిగుల క్షేమకరమని గాఢగా నమ్ముము. అందువలన నోరిమియందు నీవు జెందియున్న యభివృద్ధిని కనిపెట్టఁగలుగుదువు. ఓరిమిశూన్యమైనప్పుడు నీవెట్టి సత్కార్యముజేసినను నది విలువగలిగియుండ నేరదు. నీకట్టికష్టము తటస్థించినప్పుడు దానిని సహింపసామర్థ్యమును దయచేయుటకు పరమేశ్వరుని వేడుకొనుము. నీవెవనికైన నొకటిరెండు మారులు మందలించినను వాఁడు దానిని వినకయుండునేని యంతకై వారల నీవు ద్వేషింపక యీశ్వరేచ్ఛానుసారము జరుగగలందు

లకు దానినంతయు నీశ్వరునకు విడిచిపెట్టుము. ఒక బాగుగా దిద్దగలిగిన మహానుభావుఁడొక్కఁ యీశ్వరుఁడే. నీవు సయితము పెక్కుదోషములను లోపములను గలిగియుంటివి. వానినెల్ల నితరులు భరింపవలసియుండెను. కనుక నీవితరులయొక్క నేరములను లోపములను జక్కగా భరింపనేర్చుకొనుము. నీవితరులను నడువఁగోరినట్లు నీవు నడువలేనియెడల వారు నీవుకోరినట్లెట్లు నడుచుచుందురు? మన మిత్రులు నిర్దోషులుగానుండఁగోరుదుముగాని మన దోషముల నివృత్తిజేసుకొనఁ బ్రయత్నింపము. ఇతరుల నేరములు చక్కఁదిద్దబడవలయునని కోరుదుము. కాని మన లోపములు చక్కదిద్దఁబడుటకుఁగోరము.

ఇతరు లేదయిన నివ్వబడినయెడల నది మన కసూయాకరముగా నుండును. మనము కోరినదాని నెవ్వరైన లేదని నిరాకరించినయెడల నది మనకుఁ బ్రాణసంకటముగా గనుపించును. మనము మననిర్బంధమునఁ గించుకయు నిష్టపడక యితరులు శిక్షయందు కఠినముగా నిర్బంధింపఁబడ నభిలషించుచుందుము. ఇందువలన మనము మనతోడి మానవులయెడల సమరసభావము నెంతవఱకుఁ గలిగియుంటిమో, ప్రత్యక్షముగాఁ గనుపించుచున్నది. లోకమందఱును నీతియందును జ్ఞానమునందును పరిపూర్ణులయియున్నయెడల భగవత్ప్రీతినిమిత్తము మనతోడిమానవులనుండి మనమనుభవించుట కేదియుండును? కనుకనే భగవంతుఁ డితరులభారమును మనము వహింపనేర్చుకొనుటకు దీనినంతయు నియమించెను. దోషములేని వాఁడెవ్వఁడును గనుపించఁడు.

బాధలేనివాఁడెవ్వఁడు కాఁడు. పరిపూర్ణుఁడెవ్వఁడును లేఁడు గనుక మనము పరస్పరసహనమును, అన్యోన్యసహాయమును, నుపదేశంబులును, మాదలింపులును గలిగియుండవలయును, కష్టములును, బాధలును నెవరెంతవఱకు మనోబలమును గలిగియున్నదియును, ఎవరెంతవఱకు యోగ్యతను గలిగియున్నదియును పరీక్షించుచుండును. కష్టసమయములును, బాధలును, మానవునకు మనోదౌర్బల్యమును గలిగింపవు. కాని, వాని యోగ్యతాయోగ్యతలను మాత్రము లోకమునకుఁ జూపఁగలిగియుండును.

## 17 ఏకాంతజీవితము.

నీ వెల్లవిషయములు జయించి చిత్తవిశ్రాంతి ననుభవింపఁగోరిన యెడల నెల్లవిధముల యహంభావమును పూర్ణముగా నశింపఁజేసికొనవలయును.

మతిసంఘమునందుగాని, మానవసంఘమునందుగాని సంబంధమును గలిగియుండియు ననపాయముగా సంభాషింపఁగలుగుటయు మరణపర్యంతము త్రికరణశుద్ధితో నిలిచియుండుటయు, తేలిక విషయములు గావు. ఎవఁడు కీర్తివిహీనమున పావనజీవితమున జీవింపఁగలుగునో, ఎవఁడు మరణదశయందుఁ బ్రాణముల సుఖముగా విడిచిపెట్టఁగలుగునో యాతఁడుమాత్రమే నిజమైన యదృష్టవంతుఁడు. నీవివిధముగా నుండఁగోరిన యెడల యధ్యాత్మికజీవితమునందు చక్కఁగా నభివృద్ధిఁజెంది యీలోకమునుండి తొలుగు

కొట్టఁబడుచున్న పరదేశవాసివిగా భావించుకొనుము. నీ విశ్వా-జీవితము ననుష్ఠింపఁగోరినయెడల యీలోకవ్యాపారములయందు భగవంతునికొఱకు నున్మత్తునివలె నుండుము. శిరోముండనాదిచిహ్నముల వహించినంతమాత్రమున సన్యాసి గానేరఁడు. ప్రవర్తనను చక్కదిద్దుకొనుటయు పరిపూర్ణమైన యింద్రియనిగ్రహమును నిజమైన భక్తునిగా నొనర్పఁదగిన విషయములు. ప్రతివిషయమునందును దనయాత్మకు తరుణోపాయమైనది. ఈశ్వరతేజస్సును కనిపెట్టలేనివాఁడు నిరర్థకజీవుఁడై కష్టములను బాధలను ననుభవించుచుండును. లోకమెల్లరకును దాను పరమవిధేయుఁడై తానందఱికన్నను నధమాధముఁడని పరిగణింపలేనివాఁడు దీర్ఘకాలము చిత్తవిశ్రాంతి ననుభవించుటకసమర్థుఁడగుచుండును. నీవీలోకమున నవతరించుటకు కారణమెల్లరను సేవించుటకే గాని నొకరినైనఁ బరిపాలించుటకు గాదని తెలిసికొనుము. కష్టములకోర్చి పనిజేయుటకు నీవీలోకమున సృజింపఁబడితివి. నిరర్థకవాగ్వాడంబరమువలన కాలము వ్యర్థపుచ్చుట నీజన్మోద్దేశము గాదని రూఢిగా నెఱుంగుము. ఈయిహలోకము గాఢమైన యగ్నిగుండమువంటిది. బంగారు మగ్నిహోత్రముచే పరీక్షింపఁబడుచుండునట్లు మానవులీలోకమునఁ బరీక్షింపఁబడుచుందురు. ఈశ్వరప్రీతికొఱకు హృదయపూర్వకముగా సమర్పభావమును బడయ సంసిద్ధులయియున్న వేతప్ప యాపరీక్షయందు నిలువఁజాలరు.

## 18 విబుధజననిదర్శనము.

పరమపావను లయినమనయుత్తమపురుషులు జూపిన మహోత్తర మయిననిదర్శనమును కనువిచ్చి చూతుము. వారియందు పరిపూర్ణత్వ మధికవికాసముతోఁ బ్రకాశించుచున్నది. దానియందు మనము గలిగియున్న యోగ్యతయంతయు మహాసముద్రమునందు జలబిందువువలెఁ గనుపించుచుండును. వారియుత్తమజీవితములో సరిపోల్చిచూచినప్పుడు మనజీవిత మెంత? మహాత్ములును ఏసుయొక్కమిత్రులును క్షుత్పిపాసలయందును, లేమియందును, కష్టములయందును, బాధలయందును, ఉపవాసములయందును, ప్రార్థనలయందును, ధ్యానమునందును, సమాధియందును, విచారములయందును, తిరస్కారములయందును నీశ్వరుని సేవించుచుండిరి. క్రీస్తునను సరించుటకు మహాత్ములందఱు నెన్నికష్టములభరించి యెట్టిబాధలననుభవించిరి వారు పొందియున్నకష్టము లెంతఘోరములయినవి ? వారు శాశ్వతమైనపరలోకజీవితము నాశించియుండుటచే నిహలోకజీవితమునందు నిస్పృహత్వమును గలిగియుండిరి. ఆహా ! వారిజీవితము లెంతస్వచ్ఛములయినవి ! వారు వారిజీవితములయందు స్వార్థపరత్వ మించుకైన గలిగియుండిరా? వారనుభవించియున్న మనోవికారము లెంతకఠినములయినవి ! ఎంతదీర్ఘములయినవి ! అంతరంగికశత్రువులచే వారెంతతఱుచుగా ముట్టడింపఁబడియుండిరి ! అట్టిసమయములయందు వారిని నిర్వర్తించు

టకు భగవంతుని వా రెంత గాఢముగాఁ బ్రార్థించి సేవించి యుండిరి ! వా రాచరించినయుపవాసము లెంతకఠినములయినవి! ఆధ్యాత్మికాభివృద్ధికొఱకు వారు వహించియున్నదీక్ష యెంత గాఢమైనది ! దుర్మార్గమునుజయించుటకు వారు సలిపియున్న పోరాటము లెంతఘోరములయినవి. భగవత్ప్రభావమును కని పెట్టుటకు వారు వహించియున్న జ్ఞాననేత్ర మెంత పరిశుద్ధ మైనది.

పగలంతయు వారు పాటుపడి రాత్రులయందు తమకాలమునంతయు భగవంతునిప్రార్థించుటయందు వినియోగించి యుండిరి. వారు పాటుపడుచున్నసమయములయందుసయితము భగవచ్చింతనమును విడిచియుండుట లేదు. వారు తమజీవిత కాలమునంతయు సార్థకపఱచియుండిరి. వారు భగవంతుని యందు గడపియున్నదీర్ఘకాలము నిమిషకాలముకన్నను నతి సూక్ష్మముగా వారికిఁ గనుపించుచుండెను. వా రొక్కొక్కరాత్రి యీశ్వరచింతనామృతాస్వాదితులై యానందపరవశత్వంబున నొడలు దెలియక శరీరధర్మములనుసహితము మఱచియుండిరి. వారు భగవంతునియందలి ప్రేమాతిశయంబున బంధుమిత్ర పరివారంబును గౌరవమర్యాదలను ఔన్నత్యవిశేషంబులను విడనాడియుండిరి. వారు లోకవిషయముల నించుకయు నభిలషింపక మహావైరాగ్యసంపన్నులై మెలఁగుచుండిరి. శరీరప్రకృతి ననుసరించి జీవనాధారము లైనపదార్థములనుసయితము వారు బడయనపేక్షించుట లేదు. ఉదరపోషణముకొఱకుఁ బ్ర

యత్నింపనవసరము తటస్థించినప్పుడు వారు మిగుల వ్యసనము జెందుచుండిరి. లోకవిషయములయందు మిగుల పేదలై యున్నను యోగ్యతయందును భగవదనుగ్రహమునందును మహాసంపన్నులై యుండిరి. లోకదృష్టికి వారు దరిద్రులై బాధపడుచున్నను వారలయంతరంగ మీశ్వరోపశమనముతోను వాత్సల్యముతోను పరిపూర్ణమైయుండెను. వారి లోకమునందుఁ బరదేశులై యుండియు నీశ్వరునికి ప్రాణమిత్రులై తత్సామీప్యమున నివసించియుండిరి. వారు తమదృష్టికి హీనపాత్రులై గనుపించుచుండిరి. ఈశ్వరదృష్టియందు మిగుల విలువగలిగి ప్రేమింపఁబడుచుండిరి. నిజమైననమ్రభావమున వారు స్థిరముగా నిలువఁగలిగిరి. పరమవిధేయులై యడఁకువగలిగి జీవించుచుండిరి. దానధర్మములయందును నోరిమియందును పూనికగలిగి మెలగుచుండిరి. కావున వారధ్యాత్మికజీవితమునందు దినదినాభివృద్ధి నొందఁగలిగియుండిరి. అపారమైన యీశ్వరానుగ్రహము నొందఁగలిగిరి. ఈశ్వరానుగ్రహమును బొందఁగోరినవా రందఱికిని తాము లోకమునకు నిదర్శనముగాఁ జూపఁబడుచుండిరి. అధ్యాత్మికజీవితమునందు నభివృద్ధికెక్కుటకు మనలఁ బ్రేరేపింపఁదగినంతబలము గలిగి యుండిరి.

ఆహా! ప్రారంభమునమతసంఘములన్నియు నెంతగాఢమైనబలమును గలిగియుండెను. ఈశ్వరోపాసనయందు వారు గలిగియున్న భక్తిభావ మెంతగాంభీర్యమైనది. పావనమైన యోగ్యత

కొఱకు వారాశించియున్న యాశ యెంతమహోత్తరమైనది వారు పొందియున్న శిక్ష యెంతకాఠిన్యమైనది! తమకున్న సమితులను నెంతయడకువతో గౌరవించుచుండిరి! వారు నడచిన యడుగులజాడ లింకను గనుపించుచున్నవి. వారిపావనత్వమును పరిపూర్ణత్వమును పూర్ణముగా వెల్లడించుచున్నవి. వారు ధైర్యసాహసములతోఁ బోరాడి యీప్రపంచమునంతయుఁ దమపాదములక్రింద పడఁగఁద్రొక్కిరి. వారిపుడు మహాత్ములని చేర్కొనఁబడుచుండిరి. వారు పాపపంకము నంటక తప్పించుకొనిరి. వారు వారి జీవితమునందు సంభవించినవిఘ్నక్లేశములను మిగుల యోరిమితో ననుభవించిరి. మాంద్యము, అశ్రద్ధ మనహృదయము నాశ్రయించియుండుటచే ప్రారంభమునందలి యావేశము క్రమక్రమముగా క్షీణించి తుదకు మనజీవితమునందు విసుగుజెందుచుంటిమి. అధ్యాత్మిక జీవితమునం దభివృద్ధి జెందవలయునన్న యాసక్తి నీయందు దాఁగియున్నయెడల పరమభక్తుని జీవితమును కనిపెట్టి వందించుటకవకాశము గలిగియుండును.

## 19 వ తానుస్థానములు.

పరమభక్తుపావనజీవితము సర్వయోగ్యతలుగలిగి ప్రకాశించుచుండును. వాని యంతఃకరణవృత్తి బాహ్యవ్యాపారములయందు గనుపించుచుండును. అనఁగా వానియంతఃకరణయందు ప్రకాశించుచున్న పావనస్వభావము వాని బాహ్య

వ్యాపారములయందు ప్రసరించుచుండును. నిశ్చయముగా బాహ్యవృత్తికన్నను నాంతరంగికవృత్తి పావనత్వమున నెక్కువుగా నభివృద్ధిజెందియుండవలయును. ఈశ్వరుఁడు మన బాహ్యవ్యాపారములకన్నను ముఖ్యముగా మనయంతరంగమునే పరిశీలించి చూచుచుండును. కావున, నీశ్వరదృష్టికి మనహృదయమెల్లప్పుడు పరిశుద్ధత్వముతో శోభిల్లుచుండుటకు నీశ్వరుని నెల్లప్పుడు ప్రార్థించుచుండవలయును. మనము ప్రారంభమున గలిగియున్న యుత్సాహావేశము ప్రజ్వరిల్లి మనమరణముపర్యంతము క్రమక్రమముగా విజృంభించుటకు "ఓపరమేశ్వరా! నేను స్థిరుఁడనై యుండుటకు నిపుడు జేయుచున్న పావనమైన యీనాప్రయత్నమునందు నాకుఁ దోడ్పడుము. నేనీ దినముననే దానిని సంపూర్ణబలముతోఁ బ్రారంభించుటకును నాయుత్సాహదినమువలెను నేను దానిని గొనసాగింపసామర్థ్యము గలిగియుండుటకును నన్ననుగ్రహింపుము" అని నీవు ప్రతిదినము నూతనబలము గలిగియుండుటకనుదినము నీశ్వరుని భక్తిపూర్వకముగా వేఁడుకొనుచుండుము. ఈ యీప్సితార్థసిద్ధి మనయుద్దేశముయొక్క బలము ననుసరించియుండును. ఈవిషయమునందు నీశ్రద్ధ యతిశయించినకొలఁదిని నీలాభ మతిశయించుచుండును.

నీసంకల్పము తుదవఱకుఁ గొనసాగక విఘాతమైనయెడల నీవు దృఢచిత్తముతో దానిని సంకల్పింపలేదని తెలిసికొనుము. మనసంకల్పవిఘాతమునకుఁ గారణము లనేకములు

సంభవించుచుండును. మనయనుష్ఠానమునందు లోపమించుక తటస్థించినయెడల నది మనయాత్మకు కొంత నష్టము గలిగించుచుండును. ఉత్తమపురుషులసంకల్పసిద్ధి వారిబుద్ధిబలముమీఁద కన్నను నీశ్వరానుగ్రహముమీఁద నెక్కుడుగా నాధారపడియున్నది. వారు దేనిని సంకల్పించినను నీశ్వరానుగ్రహమునే నమ్మియుందురు. మనమొకటితలచిన దైవము మఱియొకటి తలచును. తనసంకల్పమును సమర్థించుకొనుశక్తి మానవుని యందు లేదు. విధాయకధర్మము నెరవేర్పవలసివచ్చినప్పుడును పరోపకారము చేయుఁదటస్థించినప్పుడును నీశ్వరోపాసనయందు దేనినైన కొంత విడిచిపెట్టవలసియుండును. దానినింకొకప్పుడు పరిపూర్తిఁజేసి కొనఁగలము. అశ్రద్ధచేతను నవివేకముచేతను మనము దానిని విడిచిపెట్టినయెడల యాలోపమును మనమెన్నఁడును గూడ దీసికొనఁజాలము. అది మనకు హానినిగలిగించును. కార్యమును మనచేతనైనంతవఱకు కేంద్రచక్రముగాఁ జేయ యత్నించినను కొంతవఱకు కొఱతయుండక మానదు. మనకుఁ బ్రతిబంధకముగాఁ గనిపించుచున్నవిషయములను మఱింతయథాపథిగా నొనర్పఁగలందులకుఁ దగినంతకట్టుదిట్టములైన యేర్పాటులను నియమించుకొనవలెను. మనబాహ్యజీవితమును నాంతర్యజీవితమును ప్రతిదినము జాగరూకతతో పరిశోధించుచుండవలయును. ఏలనన నీరెండు నధ్యాత్మికాభివృద్ధికి ప్రాముఖ్యములైనవి. దానిని నీవెల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొనఁజాలవైతివేని ప్రతిదినము దానిని ప్రాతస్సాయంకాలములయందైనను

జ్ఞప్తికిఁ దెచ్చుకొనుటకుఁ బ్రయత్నింపుము. నీవు ప్రతిప్రాతః కాలము నాచరింపవలసియున్న విధులను నడువవలసియున్న నడవడికను నిశ్చయపఱుచుకొనుము. సాయంత్రమునందు నిన్ను నీవు పరీక్షించుకొనుము. నీ వాదినమునందు నీమాటలచేతను కార్యములచేతను భగవంతుని కెన్నిమాఱు లాగ్రహమును గలిగించితివో, నీతోడిమానవుని నెన్నిసారులు నొప్పించితివో నీవెఱుంగఁగలవు. దయ్యముయొక్క పేరణచే నావిర్భవింపు చున్న దుర్మార్గమును నెదిరించుటకు సాహసముతో నడుముగట్టి నిలుచుండుము. నీయిచ్ఛను నడఁచిపెట్టుము. నీవిపుడు సులభముగా నింద్రియవికారములను నశింపఁజేయఁగలవు. నీ వేసమయమునందును వ్యాలాప్తియుండకుము. నీవు ప్రతినిమిషము నందును నేదియైనను పయుక్తమైన పనిని జేయుచుండుము. తెలివితేటలు గలిగి శరీరసాధకముల నాచరించుము. అవి యెల్లరిచేతను నేకవిధముగా నలవరచుకొఁబడవు. అందఱకును సామాన్యములుగాని సాధనములను బహిరంగముగా నభ్యసింపకుము. అట్టివిషయములు రహస్యముగా నింటికడ సురక్షితముగా నాచరింపఁదగియుండును. అంతఱు సామాన్యముగా నాచరించుచున్న మతకృత్యములను నుపేక్షింపకుము. సామాన్యవిధులను పరిపూర్ణముగాను హృదయపూర్వకముగాను నెరవేర్చినపిదప ఇంకను నీవుసావకాశమును గలిగియుంటివేని యీశ్వరోపాసనయందు నీకభిరుచికరము లైనవియమితకృత్యములను నెరవేర్పుము. అందఱు. నీశ్వరోపాసనను నేకవిధమైన

నియమములతో నెరవేర్పనేరరు. ఒకనికొకవిధమైన నారాధనయు మఱియొకనికి మఱియొకవిధమైన ఆరాధనయు రుచించుచున్నది వేరువేరుకాలములయందు వేరువేరుయారాధనలు మనకు సంతృప్తిని గలిగించుచుండును. పండుగపర్వములయందు కొన్ని విధములైన ఆరాధనలు ఆనందమును గలిగించుచుండును. మనకు మనోవికారముసంభవించుచున్నసమయమున నుపాసనావిధాన మింకొకవిధముగా నుండును. మనము నెమ్మదిగాను సుఖముగాను నున్నసమయమున మనయుపాసనపద్ధతి యింకొకవిధముగా నుండును. మనము విచారము గుందుచున్నప్పుడు మనప్రార్థనయందు కొన్ని యంశములనుమాత్రమే యోచింపుచుందుము. మనమీశ్వరుని యందానందించుచున్నప్పుడు నామకీర్తనలతో సంస్తుతించుచుందుము. పండుగపర్వపుసమయములయం దుపాసనలయొక్క మంచిపద్ధతులను నీశ్వరావేశ మతిశయించుటకొరకు నూతనబలముతో ననుష్ఠింపవలయును. ఈలోకమును విడిచి పరలోకమున శాశ్వతమైన మహాపండుగ ననుభవింపఁజనుచున్న యాత్రికునివలె యొకపండుగదినము మొదలు మఱియొకపండుగదినమువఱకు నీశ్వరసేవావిధానమును దృఢవిశ్వాసముతో సంకల్పించవలయును. అట్టిపవిత్రసమయములయందు పరలోకయాత్రికు మిగుల జాగరూకతతో సంసిద్ధులైయుండి మనయుపాసనాఫలమును భగవత్కృపవలన త్వరలో మనమనుభవింపఁబోవుచున్నట్లు గాఢముగా నమ్మి నిష్కపటమైన

భక్తి భావముతో నాయుపాసనావిధులను యథావిధిగా నాచరిం
చుచుండవలయును'

ఈప్సితార్థ మింకను మనకు లభింపక కొంత వ్యవధిగ నుపించుచున్న యెడల నీయుపాసనాపద్ధతియందింకను కొంతకొఱతను గలిగియున్నట్టును నీ వనుభవింపవలసియున్న ఫలమునకు నీ వింకను నర్హుడవుగానట్టును భావించుకొని నీ వంతకన్న నెక్కువపూనికతో నీశ్వరోపాసనావిధులను నెఱవేర్చుచు పరమాఖ్యమును నిరీక్షించుచుండుము. ''ఇట్లు నిరీక్షించుచున్న సేవకునకు ప్రభువు ప్రత్యక్షుడై వానినాశీర్వదించి తనరాజ్యమునందు వాని నధిపతిగా నొనరించును.'' (St. luke) అను మహానుభావుఁడు నుడివియుండెను.

## 20 ఏకాంతమననములయందాసక్తి.

నిన్ను నీవు విచారించుకొనుట కనుకూలమైనసమయమును గనిపెట్టుము. భగవంతుఁడు నీకుఁ బ్రసాదించిన మేళ్ళనుగూర్చి చక్కగా నాలోచింపుము. అన్యవిషయములను యోచింపక విడిచిపెట్టుము. నీమనస్సునకు విజ్ఞానముగలిగించెడి తార్కిక గ్రంథములకన్న నీహృదయమునకుఁ బశ్చాత్తాపమును గలిగించెడి యుద్గ్రంథములను నెక్కువగా జదువుము. అమితసంభాషణనుండియు ప్రశంసమాలిన ప్రసంగములనుండియు నిన్ను నీవు విముక్తిజేసుకొనుము. లోకవదంతులను చెవియొగ్గివినకుము. అ

ష్టమైన నీవు మంచి యోచనలు యోచించుటకుఁ దగిన సావకాశ ముగు గలిగియుందువు. మహాత్ములందఱును పరమార్థ విషయముల యోచింపవలసి వచ్చినప్పుడు మానవ సామీప్యమును విడిచి యేకాంతమునందు నివసించుచుండిరి.

„నేను మానవునితోఁ గూడియున్నప్పుడెల్ల మానవత్వము గొంత భ్రష్టీకరించుచున్నది" అని యొక బుద్ధిమంతుఁడు జెప్పియుండెను. మనము దీర్ఘసంభాషణకు జొచ్చినప్పుడీ మాటల యొక్క సత్యము మనకు గొంత యనుభవమునకు వచ్చుచున్నది మితముగా సంభాషించుటకంటె సంభాషణను పూర్ణముగా విడిచిపెట్టి మౌనముతో నుండుటయే సులభసాధ్యము. మానవసముదాయమును జేరి సంభాషణయందు జాగ్రతగానుండఁ బ్రయత్నించుటకంటె యింటికడ నొంటరిగా నుండుటయె సులభసాధ్యము. కావున అధ్యాత్మిక జీవితమును బొందఁగోరిన వారందఱును జనసమూహములవిసర్జించి భగవంతునితో మెలఁగఁగోరుట నేయాపరణీయము. ఇంటికడనొంటరిగనుండ నేర్చినమానవుఁడు తప్ప బహిరంగముగా జనసమూహము నెదుట నిర్భయముగా కనుపింపఁజాలఁడు. మౌనముతో నుండనేర్చినవారు దక్క తదన్యులెవ్వరును సురక్షితముగా సంభాషింపనేరరు. తానొకరికిలోబడియుండనేర్చిన నేతప్ప యితరులను తానుచక్కగా నాజ్ఞాపింపఁజాలఁడు. అంతరాత్మయొక్క యోగ్యతా పరిమాణమును బడయఁగలిగిన నే గాని సుఖముగానానందింపఁజాలఁడు మహాత్ములు పొందియున్న నిర్భయత్వము భగవద్భయము ననుసరించియున్నది. యోగ్యత

తోను యీశ్వరవాత్సల్యముతోను వారుజక్కఁగాఁ బ్రకాశించు చుండుటచే నధిక దైన్యముతో తమ్ముఁగూర్చి తాముచింతించు చుండిరి దుర్మార్గులు పొందియున్న నిర్భయత్వము గర్వమునుండియు అహంభావమునుండియు బయలువెడలుచున్నది కాని తుదకది నిరాశగా పరిణమించుచున్నది. నీవెంతపరమభక్తుఁడవైయున్నను నిహజీవితమునందు నీవు నిర్భయత్వము గలిగియుంటివని యూహింపకుము.

నీవు మానవునియొక్కయం దార్శనికుఁడవని పరిగణింపఁబడుచున్నను నీవు కలిగియున్న అహంభావమును బట్టి అనేకమారు లపాయము నొందుచుంటివి. అట్టిసమయములయందు మనోవికారహేతువులనుండియు కష్టములనుండియు నీవు పూర్తిగా విముక్తి నొందనేరకుండుట నీకు క్షేమకరము. ఏలనన వారు కష్టములవలనను మనోవికారములవలనను నీవు తరుమఁగొట్టఁబడనియెడల నీగర్వమును అహంభావమును నతిశయించి ప్రపంచసుఖములయం దధికానురాగమును గలిగియుందువు. అస్థిరములైన సుఖములకును అశాశ్వతమైన యానందమునకును ప్రయత్నింపని యుత్తమపురుషుఁడు తనయంతరంగమును నెంత యోగ్యముగా సంరక్షించుకొనుచుండెను. ప్రపంచవిషయములకు లొంగని పుణ్యపురుషుఁడు తనహృదయపావనత్వమును నెట్లు కాపాడుకొనుచుండెను! నిరర్థకములైన చింతలను హృదయమునుండి కడలద్రోసిన మహానుభావుఁ డెట్టి చిత్తవిశ్రాంతిని నెమ్మదిని ననుభవించుచుండెను. అట్టిపుణ్యాత్ముఁడు ప్రపంచకవిష

యములను నించుకయు నాశింపక తనవిశ్వాసము నంతయు భగవంతునియందుమాత్ర మేనిలిపి పరమార్థవిషయము నే యెల్లప్పుడు యోజించుచుండును. లేనియెడల గాంభీర్యమయినయను తాపము లభింపనేరదు. నీవు నిజముగా నను తాపమును బొందదలచితివేని ప్రపంచకల్లోలము నిన్నంటనిచ్చుండునట్లు యేకాంతమైన నీమందిరము బ్రవేశించి "నీవు నీ మానస్సుతో కలసి సంభాషించుకొనుము. అపుడు నీవు నెమ్మదిని గలిగియుందువు" అని యొక బుద్ధిమంతుడు చెప్పినట్లు చేయుము. ఆమందిరమునకు వెలుపల నున్నప్పుడు నీవుపోగొట్టుకొనినదానిని నీవామందిరమున నున్నప్పుడు మరల పొందగలుగుచుంటివి. ఈశ్వరోపాసన బహురహస్యముగా నాచరింపనభ్యసించితివేని దానిమహిమను నీవుకనిపెట్టగలుగుదువు. దానిని క్రమముగా బ్రతిదినము నీవభ్యసింపవేని యది నీకు రుచింపనేరదు. అధ్యాత్మిక జీవితముయొక్క ప్రారంభమునుండియు యీయేకాంతోపాసనాపద్ధతి నభ్యసించితివేని తుదకది నీకు ప్రాణమిత్రునివలె ప్రియతమమై నూతనోపశమనమును గలిగించుచుండును. మౌనముతోను నెమ్మదితోను భక్తివిశ్వాసములగలిగియున్న యాత్మ చక్కగా నభివృద్ధిజెంది వేదమునందు దాగియున్నరహస్యముల గ్రహింపనేర్చియుండును. అపుడు ఆత్మ యనుతాపదుఃఖమువలన బ్రవహించుచున్నకన్నీటిధారలచే దడుపబడి శుచియై పావనత్వముతో భాసిల్లుచుండును. ప్రపంచకముయొక్క సంక్షోభమునకు తాను దూరమైనకొలదిని సృష్టికర్తయైనపరమేశ్వరునితో దానధి

కపరిచయమును గలిగియుండును. మానవుఁడు బంధుమిత్రాదులను నితరపరివారవర్గమును విడిచి దూరముగానున్నకొలఁదిని భగవంతుఁడు తన్ను బరివేష్ఠించియున్న దేవతాసమూహముతో వానిని సమీపించుచుండును. తన యాత్మాభివృద్ధిని తగినజాగ్రత్తతో గమనించుచుండుట మిగుల క్షేమకరము. ఈశ్వరజీవితమును తాను బూర్ణముగా ననుష్ఠించుటయు లోకవ్యవహారములయందు తాను తెలుచు కనుపించకుండుటయు మిగుల వినుతింపఁదగిన విషయములయి యున్నవి.

చూడఁగూడనివిషయమును నీవు జూడ నేలనభిలషించెదవు. ప్రపంచకము గతించుచున్నది. అందుజనించుచున్న మోహావికారము సయితము నశించుచున్నది. ఇంద్రియజన్యములైన కోరికలు మరల నలుదిక్కులకు ద్రిప్పుచున్నవి. కాని, కాలము గతించినప్పుడు నీవు దేనిని మూట కట్టుకొనిపోగలవు? తిరితిపించుచున్న మనస్సును పాపపంకిలమైన హృదయమును నీవు నీతో కొనిపోగలిగిన విషయములు సంతోషముతో ప్రయాణము జేసినవాడు విచారముతో యింటికి మరలవలసియుండును. సంతోషప్రదమైన సంధ్యాకాలము దుఃఖజనకమైన ప్రాతఃకాలమును సూచించుచుండును. ఇంద్రియలోలత్వము ప్రారంభమున సుఖకరముగాను ఆనందదాయకముగాను గనుపించుచున్నను తుదకది దుఃఖముగా పరిణమించుచుండును. ఇక్కడ నీవు చూడఁజాలని విషయమును నావల నెక్కడఁజూడఁ

గలవు. పృథివ్యాప స్తేజో వాయురాకాశము లనెడి పంచ భూతములను గను దెలిచి చూడుము. ఈకనుపించుచున్న పదార్థము లన్నియు నీ పంచభూతములతోఁ జేయఁబడినవే. ఇవియన్నియు నస్థిరపదార్థములే. ఇందు శాశ్వతమైనపదార్థమేదియు గనుపించదు. ఈశాశ్వతపదార్థను మఱియొకచోట జూడఁగలవనితలంచుచుంటివి. అస్థిరని నీవెన్నడును బొందఁజాలవు. ఈప్రపంచకమును యిందలి యావత్తుపదార్థములను నేకదృష్టితో నీవు జూడనేర్చితివేని యిదియంతయు మిథ్యాస్వరూపము గాక వేఱొకవిధముగా గనుపించదు. నీవు నీదృష్టిని పైకి నిగిడించి పరమేశ్వరునివంకఁ జూడుము. నీయశ్రద్ధను పాపములను క్షమింప వేఁడుకొనుము. వ్యర్థడంబములను నిరర్థకజీవులయిన డాంబికులకు విడిచిపెట్టుము. పరమేశ్వరుని కటాక్షమును బొందఁదగినసాధనములను జక్కగా గమనింపుము. నీవు కూర్చుండియున్న గదితలుపును జక్కగా మూసిపెట్టుము. ఈశ్వరుని నిన్నుఁ జేరఁబిలువుము. ఆతనిప్రేమాస్పదమైన ప్రాణబంధువునిగాఁ బ్రేమింపుము. నీవు నీ గదియందు వానియనుబంధమున బంధింపఁబడియుండుము. అందువలన నీవు పొందుచున్న యానందమును చిత్తశాంతిని మఱియొకవిధమున వెచ్చుటను బొందఁజాలవు. దీనిని విడిచి యితరతావులకుఁ జనవొల్లనప్పుడునునిరర్థకములైన లోకవృత్తాంతములను చెవియొగ్గి వినవొల్లనప్పుడును చిత్తవిశ్రాంతియొక్క యానందమును వెడతెగక ననుభవింపఁగలవు. కాని, నీ వెప్పుడైన లోకవృత్తాంత

ములఁ జెవియొగ్గి విననభిలషించినప్పుడు చిత్తవైకల్యము ననుభవించవలసియుండును.

## 21 హృదయానుతాపము.

నీవు నిజముగా నధ్యాత్మికాభివృద్ధిని జెందఁగోరిన మొడల భగవద్భీతిని నెల్లప్పుడు హృదయమున గలిగియుండుము. అధిక స్వాతంత్ర్యమును గలిగియుండుట కెన్నడు సమ్మతింపకుము. నీయింద్రియముల నన్నిటిని నీస్వాధీనమునందుంచుకొనుము. తుచ్ఛసుఖముల ననుభవించుట కెన్నడును బ్రయత్నింపకుము. నీవు నిజమైన హృదయానుతాపమును గలిగియున్నప్పుడు నిష్కపటమైనభక్తిశ్రద్ధలు నీ హృదయమున నుదయించును. హృదయానుతాపము పెక్కువిధముల యాత్మసుఖమునకు కారణమగుచున్నది. అది శూన్యమయినప్పుడు సర్వసుఖములు నశించుచున్నవి. మానవునియొక్క దుస్థితిని యోచించి నప్పుడిహజీవితము పూర్ణముగా దుఃఖభాజనమయినట్లు గనుపించుచున్నది. మనుష్యమాత్రుఁడెవ్వఁడును యిహజీవితమున సుఖింపలేక పోవుట యాశ్చర్యముగానున్నది. ఈజీవితమునం దనుభవింపఁబడుచున్న బాధలును కష్టములునుననంఖ్యాములుగా నున్నవి. మనమనస్సునకుఁ దగినసామర్థ్యము లేకపోవుటచేత మనయందలిలోపములను చక్కగా నూహింపలేక పోవుచుంటిమి. అందువలన మనయాత్మనొందుచున్న పరితాపమును మనము గుర్తింపలేకపోవుచుంటిమి. మనము నిజ

ముగా దుఃఖింపవలసియున్న సమయమున నవ్వుచుంటివి. పావనమైన యంతరంగము నందు భగవద్భీతిని గలిగియున్న నే దప్ప సరియైన స్వాతంత్ర్యమును, నిజమైన యానందమును గలిగియుండ నేరము. తనకు ప్రతిబంధకములుగా నున్న మనోవికలముల విసర్జించి యనుతాపము గలిగి తన యాత్మయం దీశ్వరానుసంధానమును గలిగియున్న మానవుఁడు మాత్రమే సుఖించుచుండును. తన హృదయమునకు మాలిన్యమును, భారమును గలిగించుచున్న ప్రతిలోకవిషయమును విసర్జించిన మానవుఁడు మాత్రమే నిజముగా సౌఖ్యవంతుఁడు. మలినములైన లోకవిషయముల విసర్జించుటకు ధైర్యసాహసములతోఁ బ్రయత్నింపుము. ఒక యభ్యాసము దానికి ప్రతికూలమయిన మఱియొక యభ్యాసమువలన మాన్పఁబడును. ఇతరుల ప్రమేయమును నీ వెంత మాత్రము కలుగఁజేసికొనక వారిని వారికి విడిచిపెట్టఁగలిన తెలివితేటలను నీవు గలిగియుంటివేని వారు నీ కార్యమును నీవు చక్కఁగా నిర్వహింపఁగలుగుటకు నీకు నిన్ను విడిచిపెట్టుదురు. ఇతరుల వ్యాపారములయందు నీవించుకయును ప్రసక్తి గలిగి యుండకుము. నీవు మహాప్రహాప్రయోజకునివలె గొప్పగొప్ప వ్యాపారములయం దెంతమాత్రము ప్రమేయము గలిగియుండకుము. నీవు నీ దృష్టిని యెల్లప్పుడు నీ యందుననే యుంచుము.

నీవు స్నేహితులను మందలించుటకన్న నిన్ను నీవు ముఖ్యముగా మందలించుకొనుము. మానవుల యొక్క యనుగ్రహమును నీవు బొందఁజాలనప్పుడు నీ వందులకు విచారింప

సుము. నీవు నిజమైనయీశ్వరసేవకుఁడ వగుటకును పరమభా గవతశిఖామణివై ప్రకాశించుటకును తగినంతయోగ్యతతోను జాగరూకతతోను ప్రవర్తింపలేకపోవుచున్నందుకు విచారింపు ము. ఈజీవితమున శరీరసౌఖ్యమును నింద్రియ సుఖములును తెలుచు సంభవింపకుండుట మిగుల క్షేమకరమని యోజింపు ము. మన మీశ్వరోపశమనమును బొందలేక పోవుటకును నీశ్వ రోపాసనయం దాసక్తిగలుగక పోవుటకును కారణమేమనఁగా ప్రాపంచికోపశమనముల నభిలషించుట, యింద్రియసుఖముల ను విడిచిపెట్ట లేక పోవుటయు. ఇందుచే నీ వీశ్వరోపశమనము నెంతమాత్ర మర్హుఁడ వలేక పోవుటయేగాక ప్రపంచకకలతల నను భవింపఁదగియుంటివని యోజించుకొనుము.

మానవుఁడు పరిపూర్ణమైన హృదయానుతాపమును గలిగియున్నప్పుడీప్రపంచమంతయు విషప్రాయముగాను నిహ లోకజీవితము మిగుల భారముగాను గనుపించుచుండును. నిజ ముగా బుద్ధిమంతుఁడైనవాఁడు కన్నీళ్ళు విడుచుటకును ఖేదపడు టకును దగినంతకారణమును కనిపెట్టఁగలఁడు.

తనజీవితమును జక్కఁగా బరిశీలించిచూచినప్పుడుగాని లేక తనతోడిమానవుని విచారించిచూచినప్పుడుగాని యీలో కమున బాధలను కష్టములను ననుభవింపనివారెవ్వరును లేరని నీవు తెలిసికొనఁగలవు. నిన్ను నీవు గాఢముగా పరీక్షించుకొనిన కొలఁదిని నీవు విచారింపఁదగిన కారణమును జక్కఁగా కనిపెట్ట గలవు. పరమార్థవిషయములఁ దెలిసికొనలేక నిన్నడ్డుకొను

చున్న దురాలోచనలును దోషకృత్యములును మనహృదయా
పరితాపమునకును విచారమునకును కారణములై యున్నట్లు
నీవు తెలిసికొనఁగలవు. నీజీవితముయొక్క దీర్ఘకాలమునను విచా
రించుటకన్న నిన్ను సమీపించుచున్న మృత్యువునుగూర్చి
నీవు బాగుగా యోచింపఁగలిగితివేని నిన్ను నీవు చక్కదిద్దుకొ
నుట కధికాతురత్వముతోఁ బ్రయత్నించుచుందువు. ముందు
నీవు పొందఁబోయెడి నరకబాధలను నీవు యోచించితివేని యీ
ప్రపంచకములో నీకిపుడు తటస్థమగుచున్న బాధలకును పరి
తాపమునకును నీ వించుకైన జంకనేరవు. ఈవిషయములు
మన మనస్సున చక్కగా నాటకుండుటచే మనమింకను ప్రపం
చసుఖముల నాశించుచుంటిమి. దైవవిషయముల మాంద్యము
తో నుపేక్షించుట కిదియే కారణము. ఈయోజన మనహృద
యమున తఱచు కలుగకుండుటచే కష్టములకును బాధలకును
నిలువనేరక మొఱఁబెట్టుచుందుము. కనుక యనుతాపబుద్ధిని
నీకుఁ బ్రసాదించుటకు సర్వేశ్వరుని పరమవిధేయతతో వేఁడు
కొనుము. నీవు పరమభక్తులతోఁ గలసి "ఓప్రభువా! కన్నీటి
ధారలను నాహారమును నాకు సమృద్ధిగా నొసఁగుము" అని
యెల్లప్పుడు ప్రార్థించుచుండుము.

### 22 మానవజీవితముయొక్క దుస్థితి.

నీచిత్త మీశ్వరునివంకను మరలిననేతప్ప నీవెచ్చటను
న్నను నేవంకకు నడిచినను నీవు దురదృష్టవంతుఁడవే. నీవు

తలఁచినట్లేమియు జరుగనప్పుడును నీకోరినవిషయములు నీకు చేకూరనప్పుడును నీహృదయమును నేల కలతపెట్టెదవు? తాను కోరినవిషయములను బొందఁగలిగినవాఁడెవ్వఁడైన నీప్రపంచక మునగలఁడా? నీవుగాని నేనుగాని లేక మఱియెవనికిగాని వాంఛించిన వాంఛితంబులు చేకూరుచున్నవా?

రాజుగాని బంటుగాని యీప్రపంచమున కష్టములగాసి జెందనివారును బాధజెందనివారును నెవ్వరైనగలరా? ఈలోకములో పూర్తిగా సౌఖ్యపడుచున్నవాఁడెవ్వఁడు? ఈశ్వరుని నిమిత్తము బాధపడుచున్నవాఁడెవ్వఁడైనగలఁడా. పామరజనులనేకులు "వాఁడెంతయదృష్టవంతుఁడు? వాఁడెంత సౌఖ్యవంతుఁడు? వాఁడెంతధనవంతుఁడు? వాఁడెంతశక్తివంతుఁడు? వాఁడెంతప్రయోజకుఁడు?" అని చెప్పుచుండిరి. నీవాపారమార్థికధనమును కనుదెఱచి జూడుము. ఈప్రపంచధనమంతయు నిరర్థకము. అశాశ్వతము. బాధాకరము. భయోత్పాతమైనది. భయముతోను వ్యాకులముతోను సంపాదింపఁబడుచున్నది. మానవసౌఖ్య మశాశ్వతపదార్థముల నధికముగాఁగలిగియున్నంతమాత్రముచేతఁ గలుగనేరదు. ఈలోకమున జీవింపఁగలుగుటకు వానిని మితముగాఁ గలిగియున్నఁ జాలును. అమితముగా వానిని గలిగియుండుట బాధాకరముగాని లాభకరముగాదు. ఈలోకమున జనన మొందుటయే మిగుల బాధాకరము. ఇహలోకజీవితము దుఃఖభాజనము. మానవునికధ్యాత్మికజ్ఞాన మతిశయించినకొలఁదిని నీప్రస్తుతజీవితము

మిగుల విషప్రాయముగాఁ గనుపించుచుండును. ఏలయన మానవస్వభావము యొక్క యపభ్రంశ మానవుఁడు కనిపెట్టి చూడ గలఁడు. మానవుఁడు శరీరపోషణ కవసరములైన యాహారాది పదార్థముల సంపాదించుకొనుటకు మిగుల కష్టపడవలసియుండెను. పాపమును విడిచిపెట్టిన పావనహృదయముగల యీశ్వరభక్తుని కిది మిగుల బాధాకరముగా నుండును. ఇహసంబంధమైన శరీరమును పోషించుకొనవలసివచ్చినప్పు డాంతరంగిక పురుషుఁడు మిగుల వ్యథజెందుచుండును. కనుక "ఓ ప్రభువా దుస్థితినుండి నన్ను యుద్ధరింపుము" అని ఈశ్వరభక్తుఁడు వానినుండి ముక్తిజెందుటకు నీశ్వరుని సదా ప్రార్థించుచుండును. తమదుస్థితిని నెఱుంగనివారందఱు పరితాపభరము ననుభవింపవలసియుండిరి. దుస్థితితోఁగూడిన యీ భ్రష్ట జీవితమున జీవింపఁదలచినవా రంతకన్న నెక్కుడు పరితాపము నొందవలసియుండిరి. ఈ పాడుజీవమున నాశించు మన్న బుద్ధిహీనులనేకులు గలరు. వారెట్టి ప్రయాసమునకైన తలయొగ్గి యకార్యకరణమునకించుకయుసంకోచింపక నితరులను వంచించియో పీడించియో యుదరపోషణపరితంబున గాలమంతయు వ్యర్థముగాఁ బాడుఁజేసుకొనుచుండిరి. ఈశ్వరరాజ్యమున సుఖించుట కించుకయుఁ బ్రయత్నింపక యీ పాడుజీవితమే సౌఖ్యదాయక మనియెంచి యీ లోకమున నంటికట్టుకొని వ్రేలాడఁజూచుచుండిరి. ప్రపంచవిషయములయందు విరామము లేక మునుగుచున్న వా రెంత యవివేకులు! శరీరభోగములును ప్రపంచవిషయములును దక్క

తదితరమేదియు వారికి రుచించుట లేదు. ఈమరదృష్టవంతు లందఱు తుదకు నెట్టిహేయపదార్థముల నభిలషించిరను మడిరో యెట్టి నిరర్థకవిషయములం దగిలియుండిరో తెలుసుకొని పరితపింపం గలరు. మహాత్ములందఱును నింద్రియభోగములయందును పైకి కొంతకాలమువఱకు సుఖదాయకములుగాఁ గనుపించుచున్న తుచ్ఛవిషయములయందును పూర్ణముగా విరక్తిఁ జెందియుండిరి. అనితరాతురతతో వారు శాశ్వతసుఖమునిమిత్తమే యాశించుచుండిరి. వారికోరికలంతయు నీకనులకుఁ గోచరింపనిమహత్తర విషయమున నిలిచియుండుటచే వారు పరలోకమువంకకుఁ జూచుచుండిరి. ఈకనుపించుచున్న పదార్థముల నాశించి తమచిత్తము భ్రష్టీకరించు ననుభీతిచే వారిహలోకమువంకఁ జూడకుండిరి.

ఓ నాప్రియసహోదరా! అధ్యాత్మికజీవితమునం దభివృద్ధిజెందవలయు నన్నయాశను విడిచిపెట్టకుము. నీ కింకను దగినంతసావకాశమును తీరికను గలిగియుంటివి. నీ సదుద్దేశము నేల విడిచిపెట్టఁదలచెదవు? నీవు వెంటనే లేచి చేయవలసియున్న కార్యమును ప్రారంభింపుము ''కార్యాచరణమున కిదియే మంచితరుణము. నీ ప్రయత్నమును కొనసాగించుట కిదియే మంచిసమయము. ఇది నిన్ను నీవు చక్కదిద్దుకొనవలసినయుక్తకాలము'' అని నొక్కివక్కాణింపుము. నీవు బాధనిజెందియున్నప్పుడును కష్టముల ననుభవించుచున్నప్పుడును నీ యోరిమి యొక్క సత్ఫలమును బొందవలసియున్న కాలమని దృఢముగా

నెఱుంగుము. నీవు సౌభాగ్యప్రదేశమును జేరఁబోవుటకుముందు అవసరమైనయెడల నగ్నిహోత్రమునందైనను దూకవలయును లోతుల మునుఁగవలసివచ్చినను మునుగవలయును. ఇందులకు నీవు వెనుకదీసితివేని నీవాసౌభాగ్యమును ననుభవింపఁజాలవు. నిన్ను నీవు హింసించిననేదప్ప నీమాలిన్యస్వభావమును నీవు జయింపనేరవు. నీ వీ యశాశ్వతశరీరమును వహించియున్నంత వఱకు పాపమునుండి విముక్తిఁజెందుటకును బాధలను కష్టములను నంటక జీవించుటకును శక్తిగలిగియుండనేరవు. పాపముల మూలమున మానసనిర్మలత్వమును పోగొట్టుకొనినయెడల మనస్థితిని విడిచి సుఖముగా నెమ్మదిగలిగియుందుము. ఇందువలన మన సౌఖ్యమునకనుచితము భంగముగలిగించుకొనుచుంటిమి. కావున దౌష్ట్యము జయింపఁబడువఱకును మనజీవితముయొక్క యనిత్యత్వము నశించువఱకునునోరిమిగలిగియీశ్వరానుగ్రహముకొఱకు నిరీక్షించియుండవలయును. ఓరా! మానవునిదుర్బలత్వమెంతచెడ్డది. అదియెల్లప్పుడు పాపకార్యములను జేయఁ బ్రేరేపించుచున్నది.

ఈదినమున నీవు తప్పుజేసియున్నట్టు యొప్పుకొంటివి. ఆతప్పులనే మరల రేపు చేయుచుంటివి. నీమనస్సును పాపకార్యములయందెంతమాత్రము బ్రసరింపనీక సర్వవిధముల జాగ్రత్తగలిగిసంచరించుటకు నీవు నిశ్చయించుకొంటివికాని కొన్నినిముషములలో నీనిశ్చయమును మఱచి మరల యెప్పటియట్ల వ్యవహరించుచుంటివి. కావున మనమెల్లప్పుడు హైన్యభావమును

గలిగియుండుటకును యొకప్పుడును గొప్పవారమని పరిభ్రమిం
పకుండుటకును తగినంత కారణమును గలిగియుంటిమి. ఏలనన
గా మనము మనోబలములేనివారము. చంచలచిత్తులము అధిక
పరిశ్రమతోను ప్రయాసముతోను యీశ్వరానుగ్రహము
వలన మనకు లభించిన యోగ్యతనుసయితం మశ్రద్ధజేసి చెడఁ
గొట్టుకొనుచుంటిమి. మన జీవితముయొక్క బాల్యదశయందు
మానమించుకైన శ్రద్ధజేయనియెడల తుదకు మన గతియేమగు
ను? మనమాటలయందు పాపచిహ్నములు గుఱుతుగనుపిం
చనప్పుడు రక్షకత్వమును చిత్తశాంతిని పొందియున్నట్టు భావిం
చి నిర్భయముగా సంచరించితివేని నీవు తప్పక విచారపడవలసి
యుందువు బాల్యప్రాయములైన ప్రారంభకాలమందె మనము ప్ర
తినిత్యము అదియే నూతనమైయున్నట్టు పాపపసూత్రములను
బోధింపఁబడితిమేని యది మనకు మిగుల క్షేమకరమైయుండును
ఇందువలన మనభవిష్యద్వర్తనమును చక్కదిద్దుకొనుటకును య
ధ్యాత్మిక జీవితమునందును మిగుల యభివృద్ధిఁజెందఁగలిగియుం
డుటకును నవకాశమును గలిగియుందుము.

## 23 మరణచింతనము.

శీఘ్రకాలములో నీయిహజీవితము ముగియబోవుచున్న
ది. అప్పుడు భగవంతుని సముఖమున నీస్థితి యెట్లుండునో యో
చించుకొనుము. నిన్న మనము వానిని జూచియుంటిమి. నేడా

తండు మనకు గనుపించుటలేదు. ఇప్పుడాతండు మన జ్ఞప్తియం
దైనను లేదు. ప్రస్తుతవిషయమును మాత్రమే యోచించు
చున్న యీమాంద్యహృదయము ముందు మనకు దటస్థింపఁబో
వుచున్న విషయములను యోజింపలేకపోవుచున్నది. ప్రతి
యాలోచనయందును కార్యమునందును యీరోజుననే నీకు
మరణము తటస్థింపనున్నట్లు యోజించుకొనుము. నీయంతరం
గము నిర్మలమై పావనత్వముతో బ్రకాశించుచున్నయెడల
నీవు చావునకించుకయు భయపడనేరవు. చావును దప్పించుకొని
పారిపోవుటకంటె పాపకార్యములను విడిచిపెట్ట బ్రయ
త్నించుట మిగుల లాభకరము. ఈదినముననే నీవు చచ్చుటకు
సంసిద్ధమై యుండనియెడల రేపెట్లు సంసిద్ధమైయుండగలవు. రే
పటిదినము మనకు స్థిరముగాదు. అట్టిసంగతిలో రేపటివఱకు
నీవు జీవింపగలవని నీవెట్లు నమ్మగలవు ?' మన జీవితకాలమంత
యు నిరర్థకముగా గడుపుచున్నప్పుడు మనము చిరకాలము
బ్రతికియుండిన నేమి ప్రయోజనము? మనము దీర్ఘకాలము
బ్రతికియున్నందువలన మనజీవితమునకు పావనత్వము లభింప
గలుగునా ? అంతమాత్రముచేత మనప్రవర్తన చక్కబడనే
ర్చునా. మన మెక్కువకాలము బ్రతికినకొలందిని మన మాచరిం
చుచున్న దోషములసంఖ్య యధికమగుచుండును. మనమీ
లోకమున దోషముచేయని దిన మేదియైన గలదా? అనేకులు
దీర్ఘకాలమునుంచి మతము నవలంబించి యుంటిమని గర్వించు
చుండిరి. అందువలన వారు పొందియున్నలాభము లవలేశమైన

గలదా? చచ్చుటయే నీకు భయావహమై యున్న యెడల నీవు గ్రతికియుండిన సంతకన్న నెక్కుడు ప్రమాదకరమని భావించుకొనుము. ఎవడు ప్రతిదినము తన మరణకాలమును తన కన్నులయెదుట గాంచగలిగియుండునో యెవడు ప్రతనిత్యము జావసిద్ధయించుకొనుచుండునో నాతడుమాత్రమే మిగుల సౌఖ్యవంతుడు.

ఎవరైన చచ్చుచుండుట నీవుగాంచినప్పు డాయవస్థను నీవును ననుసరింపవలసియున్నట్టు జ్ఞాపకముంచుకొనుము. అది యుదయకాలమైనయెడల సాయంకాలమువఱకు జీవించియుండగలవని దలంపకుము. అది రాత్రికాలమైనయెడల యామఱు చటి ప్రాతఃకాలమును నీవు జూడగలనని నమ్మియుండకుము. కనుక నీవెల్లప్పుడు చావునకు తయారుపడియుండుము. అనేకులు తలవని తలంపుతో నాకస్మికముగా జనిపోవుచుండిరి. నీకంత్యమదశ సమీపించినప్పుడు నీవు వెనుక నడచిన నడకయంతయు నీకు జ్ఞప్తికివచ్చి నీవు మిగుల పరితపించుటయేగాక అశ్రద్ధచేసిన నుపేక్షచేసిన నీ జీవితమంతయు నిరర్థకమైనందుకు వ్యధజెందుదువు. మరణకాలమున దానెట్లుండదలచునో నట్లుండుటకు బ్రతికియున్నప్పుడే ప్రయత్నించువాడు మిగుల జ్ఞానవంతుడు. సుఖకరమైన మరణమును బడయగోరినవారు తమ జీవితకాలమంతయు పావనజీవితమున జీవింపనేర్చుకొనవలయును. ప్రపంచకవిషయముల పూర్తిగా నిరసించుటయు యోగ్యతయందును పావనత్వమునందును నభివృద్ధిజెంద గాఢముగా

నపేక్షించుటయు శిక్షయం దనురక్తియు, అజ్ఞానదశయందు తాను జేసియున్న పాపములకు పశ్చాత్తాపము నొందుటయు, అందఱియెడలను బరమవిధేయుడై యడకువగలిగి మెలగ బ్రియత్నించుటయు, స్వార్థపరత్యాగమును శత్రుజనులయందు సహనము గలిగియుండుటయు బాధలయందును కష్టములయందును యోరిమిగలిగి యుండుటయు యీ లక్షణములన్నియు సౌఖ్యకరమైన మరణమునకు సాధకములని మనకు దృఢనమ్మకమును గలిగించుచున్నవి. నీవు బాగుగానున్నప్పుడు మంచి కార్యములనేకముఁ జేయఁగలవు. చెడుగానున్నప్పుడేమి మంచి కార్యములనుఁ జేయఁగలవు. అనారోగ్యముగా నున్నప్పుడు? మంచికార్యములనుఁ జేయఁగలిగినవారును చక్కగా సంస్కరింపఁబడినవారును అంతగా కనుపింపరు. యెల్లప్పుడు యొకతావు నుండి మఱియొకతావునకు తిరుగులాడుచున్నవారు నయితము పావనకార్యములఁ జేయఁగలిగియుండుట యరుదుగా కనుపించుచున్నది.

నీవు నీ బంధుమిత్రులను తోడిమానవులను నమ్మియుండకుము. ఆత్మరక్షణమును బొందఁదగిన సాధనము ముం దెప్పుడఁబడిన సరయువచ్చువన్న వెఱ్ఱినమ్మకముచే నిపుడుపేక్షించి యూరకుండుము. ఈ మానవబృందమంతయు నీవు తలఁచిన కన్న నెక్కువత్వరలో నిన్ను మఱచియుండును. ఇతరులసహాయమును నమ్మి యుపేక్షించి యూరకుండక ముందు సమయ మాసన్నమైనప్పుడు నీ వనుభవించుటకుఁ దగినసంపాదనమును

వీ యుక్తకాలమున సంపాదించికూడబెట్టుము. ఇపుడు నిన్నుఁ గూర్చి నీవు తగిన జాగ్రత్త తీసుకొనినయెడల ఆవల నిన్ను గూర్చి జాగ్రత్తదీసుకొనువా రెవరు? ఈ ప్రస్తుతకాలమే మంచితరుణము. ఆత్మరక్షణము బొందదగినట్టి దినమిదియే. ఇదియే నీవు తరుణోపాయము నారయదగినసమయము.

శాశ్వతజీవనముయొక్క మూలధనమును సంపాదించి కూడబెట్టవలసియున్న యీయుక్తకాలమును నీ వెట్లు నిరర్థకముగా గడపి పాడుజేయుచుంటివి! నీవు నడతచక్కదిద్దుకొనఁ దలచెడి సమయమెప్పుడో యొకప్పుడు తటస్థమవును. కాని, యపుడది నీకు సంప్రాప్తమౌనని నేను జెప్పఁజాలను. ఓ నాప్రియమిత్రుఁడా! నీ మరణకాలమును నీవెల్లప్పుడు స్మరణకుఁ దెచ్చుకొనుటచే యెంతయుపద్రవమునుండి నిన్ను నీవు రక్షించుకొనుచుందువు! యెట్టిభీతినుండి నిన్ను నీవు కాపాడుకొనగలిగియుందువు. మరణమునకు నీవు భీతిజెందుటకంటె దానియం దానందించుటకు నీవు సమర్థుడవై యుండునట్లిపుడు జీవింపబ్రయత్నింపుము. క్రీస్తుతో నీవు జీవింపగలిగియుండుటకు యీప్రాపంచకదృష్టికి నీవు చచ్చియుండుము. ఈప్రపంచకవిషయముల నన్నిఁటిని నీవు తిరస్కరింపనేర్చియుండుము. అపుడు నీవు నీ విచారము .. బాసి సుఖముగా క్రీస్తును జేరగలుగుదువు. నీవు నిర్భయుడవై యుండగలుగుటకు యింద్రియోద్రేకమును వణచి పెట్టి శరీరమును శోషింపజేయుము.

ఓ వెఱ్ఱివాఁడా ! యొకదినమైన జీవింప స్థిరము లేనప్పుడు దీర్ఘకాలముఁ బ్రతుకఁగలవని యేల తలచెదవు. ఎందఱోవిషయామున మోసపోవుచుండిరి. ఎందరు తలవనితలంపుగా నీలోకమును విడిచిరి. " అయ్యో వాడు చంపఁబడెను. వాడు నీటమునిగి చచ్చిపోయెను. వాడు క్రిందపడి చచ్చిపోయెను. ఒకడు భుజించుచూ చచ్చిపోయెను., కూర్చుని మాటలాడుచూ చనిపోయెను. ఆడుచూ చనిపోయెను " అను వార్తల నెంత తఱుచుగా వినుచుంటిమి.

ఒకడు అగ్నిలోబడి దగ్ధమైనట్టును మఱియొక్కఁడాయుధముచే నఱకబడినట్టును, యింకొకఁడు రోగముచే చనిపోయినట్టును మనము తఱుచుగ వినుచుంటిమి. ఏదో యొకవిధముగా మరణము ప్రతిమానిని యంతము నొందించుచున్నది. చాయవలె మృత్యువు వెనుదగులుచున్నది. ఆయువు త్వరితగతి నశించుచున్నది. నీవు చనిపోయినతరువాత నిన్ను జ్ఞాపకముంచుకొనువా రెవరు ? ఆవల నీకు దరుణోపాయముఁ జూపువా రెవరు. నిన్ను రక్షింప నీశ్వరు నెవరు ప్రార్థింతురు. ఓ నా ప్రియమిత్రమా ! నీతరుణోపాయము నిప్పుడే విచారింపుము. నీవు రక్షణఁబొందఁగగిన మార్గమును నిప్పుడే కనిపెట్టుము నీవు నీకొఱకుఁ జేయఁగలిగినదాని నిప్పుడేఁ జేయుము. నీకు మరణ మెప్పుడు తటస్థించునో నీవెఱుంగవు. మరణానంతరము నీగతియెట్లుండునో నీవు దెలుసుకొనలేవు. నీవు జీవించియున్న

ప్పుడే యుపాయరహితమైన పావనధనమును సంపాదింపఁ బ్రయత్నించుము. నీవు నీ యాత్మరక్షణోపాయమును దప్ప యింక నేనిని విచారింపకుము. నీవప్రమత్తుఁడవై యీశ్వర విషయములనుగూర్చి మాత్రమే జాగ్రత తీసుకొనుము. పరమభాగవతోత్తములను పరమమిత్రులుగా స్వీకరింపుము. వారి నడవడిని నీవు నేర్చుకొనుటవలన నీ జీవితముయొక్క ఫలమును బొందలేక నిరాశజెందుచున్నప్పుడు అది నిన్ను శాశ్వత నివాసమునకుఁ గొనిపోవగలిగి యుండును. ప్రపంచకవ్యాపారములయందు సంబంధములేని పరదేశివలెను, యాత్రికునివలెను యీలోకమున మెలఁగుచుండుము. నీ శాశ్వత నివాసస్థానమిది గానందున నీ హృదయమునకు దగినంత స్వేచ్ఛను గలిగించి పరమాత్మవంకకు లేవనెత్తుము. మరణానంతరము నీ యాత్మ యీశ్వరరాజ్యమున సుఖింప నర్హమైయుండుటకు నీ నిట్టూర్పులను, స్తుతిపాఠంబులను ధ్యానధారణంబులను యను దినం బీశ్వరునివంకకు నడిపింపుము.

## 24 న్యాయవిచారణ, పాపశిక్షణ.

నీవు జేయుచున్న ప్రతికార్యమునందును దాని పర్యవసానమును యోచింపుము. నీవు విచారింపఁబడుటకు కచ్చితమైన న్యాయాధిపతియెదుట నిలువవలసియుందువని దృఢముగా నమ్ముము. నీవు వానికి దేనిని వాయిదాగఁ జేయఁజాలవు. నీవు వానికేదయిన లంచమివ్వఁదలఁచినను దాని నాతఁడు పరిగ్రి

హింపఁడు. ఆతఁడు నీక్షమాపణల నంగీకరింపక న్యాయమును బట్టి నిన్ను విచారించును.

మందభాగ్యుఁడవైన యో బుద్ధిహీనుఁడా! దురాగ్రహశీలుఁడైన మానవుని మోముఁ జూచి వెఱఁగుఁజెందెదవు. నీవు ఈశ్వరునియెదుటనిలచి యెట్లు నుత్తరముల నివ్వఁగలవు. వాని ముందు నీ వెంత? ఆతఁడితరుల నిదర్శనముల నవసరములేక యే నీ వాచరించియున్న దురితములను నీహృదయమును నావేశించియున్న దురాలోచనలను, నీవు తలంచుచున్న పాపపుతలంపులను సర్వమునుఁ జూచుచుండెను. ఆవిచారణాసమయమున నీవు నిర్భయముగా మెలఁగదగిన సాధనముల నిప్పుఁడేల యోచింపకుంటివి? ఆసమయమున నిన్నొరు లెవ్వరు క్షమించుటకును రక్షించుటకును సమర్థులు గాఁజాలరు. అచట యెవరిపాపఫలము వారనుభవింపవలసినదే. ఇపుడు నీవుఁజేసిన ప్రతికార్యము దగినఫలమును గలిగించుచుండును. నీవుపడిన శ్రమ చక్కఁగా ఫలించును. నీమొర యాలకింపఁబడును. నీపాపములు క్షమింపఁబడును. నీవిజ్ఞాపన మంగీకరింపఁబడును. నీబాధ యుపశమింపఁబడును. నీవు పావనత్వమును పొందఁగలుగుదువు. ఓరిమిగల మానవుఁడు శ్రేయోదాయకమైన పాపపరిహారమును గలిగియుండును. అతఁడు తనబాధకన్న నితరుల బాధలకు మిగుల పరితపించుచుండును. పరుల నేరములను హృదయపూర్వకముగా మన్నింపఁజూచుచుండును.

తనవలన యెవరికైన యాగ్రహముగలిగినప్పుడు జాగు

చేయక వారలక్షమింపవేడుకొనును. ఇతరులను గోపించుట
కన్న జాలిగొందుటకు త్వరపడుచుండును. తనయింద్రియము
లను అంతరాత్మకు వశపఱచుటకుగాను తన్ను తాను బాధిం
చుకొనుచుండును. ఆవల మనము శిక్షింపఁబడుటకు దుర్మార్గ
మును దాచియుంచుటకంటె దాని నిపుడు తొలగించుకొను
టయే యుత్తమము. అమితమైన యింద్రియపరాయణత్వము
వలన మనల మనము వంచింపజూచుచుంటిమి. పాపహృదయ
ములదక్క నరకాగ్ని దేనిని దహింపగలదు ? ఎంతవఱకు నిన్ను
నీ వుపేక్షించియూరకుందువో యెంతవఱకు నీవు నీయింద్రియ
ములను సంతుష్టిపఱుపబ్రయత్నించుచుందువో, అంతదనుక
యధికముగా భగవంతుని యాగ్రహమునకు బాత్రుఁడవగుచుం
దువు. నీ వాచరించుచున్న ప్రతికోపకృత్యము యాకోపా
గ్నిని ప్రజ్వలింపజేయుదగిన యింధనమని దెలిసికొనుము. ఏకా
ర్యములయందు మానవుడు దోషియైయుండునో యాకార్య
ర్యములయం దాతఁడు మిగుల క్రూరముగా బాధింపఁబడుచుం
డును. అపారమైన భోజనప్రియుడు క్షుత్పిపాసలచే బాధిం
పఁబడుచుండును. మాంద్యుఁడైన సోమరిపోతు యగ్నితప్తమైన
యంకుశముచే ద్వార పెట్టఁబడుచుండును. కామాంధకారంబుచే
గన్నులు గప్పబడి తిరుగువారును యింద్రియభోగపరాయణు
లును యగ్నిజ్వాలలచే నావరింపఁబడి దహింపఁబడుచుందురు.
అసూయాపరులు వెఱ్ఱికుక్కలవలె బాధతో మొఱుగుచుం
దురు. బాధతో సంబంధించనిదోష మేదియు లేదు. ఆత్మావు

నందు గర్విష్ఠులహృదయ మనేకకలవరములతో నిండియుండును. దురాశాపరు లధికదరిద్రముతో బాధపడుచుందురు. ఇచట మనము పాపపరిహారార్థ మనుభవింపవలసియున్న కాయక్లేశములకన్న యాలోకమున నియమకాలము మనమనుభవించెడి నరకబాధలు మిగులఘోరముగానుండును. యీలోకబాధలకెన్నటికైన విరామము సంభవింపవచ్చును. ఆలోకమునందు నరకబాధలనంతములు. ఎన్నటికివిముక్తిలేనివి. ఇచట నీకు బాధ గలిగినప్పుడు స్నేహితులెవరైన నిన్నౌదార్యగలరు. అచట నిన్న యౌదార్యగలిగిన స్నేహితులెవ్వరును లేరు. నీవు చేసియున్న పాపములకు నీవిపుడుపరితాపపడి నిన్న నీవురక్షించుకొనుటకాతురపడుచుంటివేని యావిచారణాసమయమున నీవు పుణ్యాత్ములతో సమముగా నిర్భయుడవై సుఖింపఁగలవు. ఎవడు సర్వకాలసర్వావస్థలయందును తన్నుగూర్చి తాను జాగ్రత తీసుకొనఁగలిగియుండునో ఎవడు తానాచరించియున్న పాపకార్యములకు నిజమైన యనుతాపమును గలిగియుండునో అట్టియుత్తమపురుషుడు తనకుఁ బాధాకరములైనవిషయములను నెదిరించుటకు మిగుల ప్రయాసమునకైననోర్చి ధైర్యసాహసములతో నిలువఁగలిగియుండును. ఇచట మనుష్యవిచారణను నడకువఁగలిగి వినయముతో భరింపఁగలిగినవారు పరలోకమున న్యాయాధిపతియెదుట నిర్భయులై నిలువఁగలరు. అపుడు నిరుపేదలును దీనులును అధికధైర్యమును గలిగియుందురు. ఇంతవ

ఱకు మిట్టెక్కియున్న గర్విష్ఠులు అన్నివిధముల భయముగలిగి బాధపడుచుందురు.

జీసనుకొఱకు వెట్టివానివలె మెలగనేర్చినవారును తిరస్కరింపఁబడినవారును యీప్రపంచమున గొప్పజ్ఞానవంతులని దెలుసుకొనఁబడుచుందురు. మనమింతవఱకు నోరిమితో భరించియున్నకలవరము మనకిపుడు పరమానందమును గలిగించి సర్వదోషముల నడచిపెట్టఁగలిగియుండును. అపుడీశ్వరునియందు భక్తిగలవారందఱు మిగుల సుఖింపఁగలిగియుందురు. భక్తివిహీనులందఱు దుఃఖింపవలసియుందురు. శరీరభోగములయందు నిరుత్సాహులై శరీరమును శోషింపఁజేసినవారు మహోన్నతపదవినొంది సుఖించుచుండిరి. ఇంతదనుక చినుగువస్త్రముల దాల్చియున్న పేదసాధువులు దేదీప్యమానమైన తేజోవికాసముచేఁబ్రకాశించుచుండిరి. చీనీచీనాంబరముల ధరించియున్న భాగ్యవంతుల వికాసంబు మాటుపడియుండెను. దివ్యభవనముల నివసించియున్న యైశ్వర్యవంతులు వన్నెదఱిఁగి నిరర్థకులై బాధపడుచుండిరి. క్షుద్రకుటీరములవసించియున్న యుత్తములైన బీదజనులు యధికగౌరవముతో మెప్పొందుచుండిరి. ధనబలముకన్నను శరీరబలముకన్నను ప్రాపంచకసంబంధమైన యెల్లబలములకన్నను యోరిమి యధికప్రభావంబుతోఁ బ్రకాశించుచున్నది సూక్ష్మమైనలోకజ్ఞానముకన్న వినయము మహోన్నతమైనజయముగలిగిఁ బ్రకాశించుచుండును. లౌకికవిద్యలన్నిటికన్నను నిష్కపటమైన నిర్మలాంతఃకరణము హృదయమునకు సంతుష్టిని

గలిగించుచుండును. ఈప్రపంచక ధనములయందలి యపేక్ష. కన్న యాధననిరసన మధికప్రాబల్యముతో హృదయమున గలిగియుండును. ఈశ్వరోపాసనమువలన నీకపుడు లభించుచున్నయుపశమన మమృతపానముకన్నను నెక్కువ రుచికరముగాఁ గనుపించుచుండును.

అపుడు నీవు నిరర్థకములైన లోకవిషయముల సంభాషించుటకన్న మౌనమునందు సంతృప్తి గలిగియుందువు. నీవపుడు మంచిమాటకన్న మంచికార్యములయందుమిగులచు ఉత్సుకదనముతోఁ బనిజేయుచుందువు. ప్రపంచిక సుఖము లన్నిటికన్నను పావనజీవితము , కచ్ఛిత మైన జీవనముగా గాంభీర్యమైనపశ్చాత్తాపమును ప్రపంచిక సుఖములన్నిటికన్న మిన్నయై ఏకధిక సంతోషమును గలిగించుచుండును. ఆవల దురంతమైన నరక బాధలను దప్పించుకొనుటకు నీవిపుడు కొన్నిస్వల్పకష్టముల భరింపనేర్చియుండుము. ఆలోకమున నీవనుభవింపఁబోవుమేటి బాధలను నీవెంతవఱకు భరింపఁగలవో యిపుడు పరీక్షించిచూచుకొనుము. ఇపుడీసుమంతి స్వల్పబాధను సహింపఁజాలనప్పు డావల దారుణమైన నరకబాధలకు నీవెట్లు తాళగలవు? స్వల్పబాధను లేశమాత్రంబైన భరింపఁజాలనప్పు డావల ఘోరమైన నరకాగ్నిని మ్రిందవలసియున్నయెడల నీవెంత పరితపించెదవు. ఇహపరలోకముల రెంటియందును సుఖించువారెవ్వరును లేరు. ఈలోకమున నీవు సుఖించితివేని పరలోకమున జీసనువద్ద సుఖింపనేరవు. నీలోకమున ననేకములయిన బిరుములతోను విసా

రమైన కీర్తితోను పలువిధములయిన సుఖములతోను దీర్ఘకాలము బ్రతికియున్నను మరణకాలమున నవి నీకెట్లు నుపకరించును? కనుక యివియన్నియు వ్యర్థడంబములు. నిష్ప్రయోజనములు. ఈశ్వరుని బ్రేమించుటయు సేవించుటయు ననవరతము సుఖదాయకములు. ఎవడు సర్వేశ్వరుని భక్తివిశ్వాసములతో మనఃపూర్వకముగా ప్రేమించుచుండునో లోకవ్యాపారములయం దీశ్వరభయ మెవని హృదయమున దట్టముగా వ్యాపించియుండునో యట్టిమానవుడు మృత్యువునకును నరకమునకును లేశమైన భయమునొందడు. ఆతని హృదయమున నాశ్రయించియున్న భక్తివిశ్వాసములు వానిని భగవత్సన్నిధానమునకు సురక్షితముగా గొనిపోవఁగలిగియుండును. దోషకృత్యములయం దానందించుచున్న దురితాత్ముడు నిరతము చావునకును నరకమునకు భయపడుచుండును. ఆతఁడట్లు భయముగలిగియుండుట యాశ్చర్యముగాదు. ఈశ్వరునియందలి ప్రేమ నిన్ను చెడుకార్యములనుండి మరలింపఁజాలనప్పుడు నరకభీతియైనను నిన్ను దుర్మార్గమునుండి మఱలించును గాక! భగవద్భీతిని సయితము విడిచియున్న మానవుడు దీర్ఘకాలము మంచిమార్గమున నిలువనేరక దయ్యముయొక్కవల దగిలి నరకకూపమున గూలుచుండును.

## 25 జీవితముయొక్క సంస్కరణము

ఈశ్వరసేవయం దప్రమత్తుడవై తగినంతశ్రద్ధను గలిగియుండుము. నీజన్మముయొక్క ముఖ్యోద్దేశమును నీవీలోక

మును విడువవలసియున్న కారణమును జక్కఁగాఁ యోజింపుము. ఈశ్వరునియందుఁ జీవించుటయు నిజమైన యాత్మస్వరూపము తోఁ బ్రకాశించుటయు నీజన్మముయొక్క ముఖ్యోద్దేశములని దెలిసికొనుము. ఆధ్యాత్మికాభివృద్ధికి నీవు కొంతకాలముఁ బ్రయత్నించితివేని నీపరిశ్రమకుఁ దగినఫలమును బొందఁగలవు. అపుడు నీవు నీయాద్యంతములయందు భీతినిగాని విచారమునుగాని గలిగియుండవు. నీవిపుడందుల కించుకఁ బ్రయత్నించితివేని మహత్తరమగు చిత్తవిశ్రాంతిని మెడతెగని యానందమును బొందగలవు. నీవు నీకార్యమునందు నెడతెగని విశ్వాసమును యావేశమును గలిగియుంటివేని నీకు దగిన పరిధానమును బ్రసాదింపఁ బరమేశ్వరుడుఁ దగిన యౌదార్యమును గలిగియుండును. నీపరిశ్రమకుఁ దగినపరిధానమును బొందఁగలవను దృఢనిశ్చయమును గలిగియుండుము. అంతమాత్రముచే నీకు భయములేదని మయిమఱచియుండకుము. అందువలన నీకు గర్వమును యశ్రద్ధయు సంభవింపవచ్చును. ఒకానొకవిషయమునందుగాసిజెంది ''యీశ్వరానుగ్రహమును బొందగలుగుదుమో లేదో'' యనుసంశయము తమ్ముబాధించుచున్నప్పుడు కొందఱు సర్వేశ్వరుని నమస్కారపూర్వకంబుగా భక్తి విశ్వాసంబులసేవించి ''పరమేశ్వరా! నీకరుణను బొంది సుఖింతునా? ఈదీనహృదయము దీన్ని తెలియగోరుచున్నది'' అని విన్నవింప ''నీవు దానిని దెలియఁగలిగిన యేమిఁజేయుదువు. ఆ చేయఁగలిగిన దానినిప్పుఁడే జేయుము. నీవట్లు జేయఁబూనితి

నేని రక్షణమును బొంది సుఖింతువు" అని ప్రత్యుత్తరమివ్వఁబడినట్లు వెంటనే వారలహృదయములవినుపించెను. వారీవిధముగా యుపశమింపఁబడినతోడనే నూతనబలముగలిగి మునీశ్వరేచ్ఛకు వశపఱచి మనస్తాపమును విడిచి సుఖించిరి. వారు తమభావిగతియెట్లుండునోయని మరల వితర్కింపక దృఢనిశ్చయులయి దామాచరించుచున్న ప్రతికార్యమును బరిపూర్తి చేయుటకు నీశ్వరునిపై భారముంచి ప్రయత్నించుచుండిరి. "ఈశ్వరుని నమ్మి మంచిచేయుచుండుము. నీవు నీశ్వరరాజ్యమున నివసించి చక్కఁగాఁ బోషింపఁబడుదువు" అని ప్రవక్త నుడివియుండెను. జీవితముయొక్క దిద్దుపాటునకును యధ్యాత్మికాభివృద్ధికిని ప్రతిబంధకముగాఁ గనఁబడుచున్న విషయమొకటి గలదు. అదియేదియన కష్టములకు వెఱగందుట హృదయమును పరితపింపఁజేయు పాపకార్యములఁ జేయకుండుటచేతను మఱియు వైమనస్యముగానున్న దురితకృత్యములను విడిచిపెట్టుటచేతను పావనమయిన యోగ్యతయందంతకన్న వెక్కుడభివృద్ధిఁ జెందఁగలము. మానవుఁడు తన్నుతానెంతవఱకు జయింపఁగలిగియుండునో యెంతవఱకు దనమనస్సుయొక్క యుద్రేకమును నడచిపెట్టఁగలిగియుండునో అంతయధికముగాఁ బావనత్వమునందాసభివృద్ధిఁ జెందఁగలిగియుండుటయేగాక మిగులయధికమయిన యీశ్వరానుగ్రహమును సహితము బొందఁగలిగియుండును. కాని, మానవులందఱు సమానముగా తమ్ముతాముజయింపనేలేరు. మనస్సుయొక్క యుద్రేకమును నడచిపెట్టనేలేరు. మానవుఁడు

పెక్కుకోరికలచే నావేశింపఁబడియున్నను వానిని నిర్జించుటకుఁ దగినంత చలముతోను పూనికతోను బాటుపడఁబ్రయత్నించి నప్పుడు యోగ్యతసంపాదించుటకుఁ దగినంత శ్రద్ధాపూనికలు లేనియుత్తమస్వభావము గలిగిన మానవునికన్నను నెక్కువ యభివృద్ధిని జెందఁగలిగియుండును. రెండుసంగతులును మన జీవితసంస్కరణమునకుఁ దగినంత బలముతో మన మనస్సును మరలించుకొనుటయు మనయం దభావమైయున్న యోగ్యత కొఱకు గాఢముగా బ్రయత్నించుటయు, యీ రెండును మన జీవితాసంస్కరణమునకు నుపకరించెడి ముఖ్యసాధనములయి యున్నవి. నీకసహ్యకరముగాఁ గనుపించుచున్న యితరుల దోషములను నిన్నంటనివ్వక పాఱఁద్రోలుము. ఇతరుల గుణమే దియైన నీకసహ్యకరముగాఁ గనుపించెనేని యది చెడుగుణమని యెఱిఁగి యట్టిగుణమును నీయందు సయితము నుండనీక విడిచి పెట్టుము. మంచియోగ్యత నీ కెవనియందు గనుపించినను వినుపించినను దాని నభ్యసించుటకు ప్రయత్నించితివేని యెల్లయెడలను నీవు కొంత యధ్యాత్మికలాభమును బొందఁ గలుగుదువు. ఎందైన నీకుఁ గొంత చెడుగు గనుపించినయెడల దానిని నీవు నేర్చుకొనకుండుటకు జాగరూకతనుగలిగి యుండుము. ఆదోషమే నిన్నెప్పుడైన బాధించుచున్నట్లు కనిపెట్టితివేని వెంటనే దాన్ని నీవు వదలుకొనుటకుఁ బ్రయత్నింపుము. నీకన్న యితరులనెట్లు పరీక్షించి చూచుచుండునో యితరులకన్న నిన్నటుల బరీక్షించి చూచుచుండుము. మన

కోడిమానవులందఱును భక్తివిశ్వాసములుగలిగి సుగుణగరిష్ఠులయి ఋజుశిక్షయందు మెలఁగనేర్చియుండిన నెంతహాయిగా నుండును. వాఁడు విధాయక ధర్మమును నిర్వహింపనుపేక్షించి యయుక్తముగా మెలఁగుచుండుటఁ గాంచినప్పుడు మన కెంత విచారముగా నుండును? మనజీవితమునకు సంబంధించిన విధుల నుపేక్షించి ప్రమేయము మాలిన యితరవిషయముల యందు జోక్యముగలిగియుండుట యెంత యుపద్రవకరము! నీ వవలంబించిన వృత్తిని స్మరణకుఁ దెచ్చికొని యాశీలువ వేయఁబడిన స్వరూపము నీ కన్నులయెదుట నుంచుకొనుము. నీ వీశ్వరమార్గమున నడువఁబూనినప్పుడు నీ జీవితము జీసను జీవితము ననుసరించియుండుటకుఁ గొంచెమయినను బ్రయత్నింపలేకపోవుటను గాంచి నీవు మిగుల సిగ్గుపడఁగలవు. ఈశ్వరేచ్ఛను, పావనజీవితమును జక్కఁగా బోధింపఁగలిగిన యవ్యాజమయిన భక్తిపరుఁడు తనకవసరములయియున్న పెక్కులాభములను నాయోజనయందు కనిపెట్టఁగలఁడు. జీసనుకన్న నెక్కుఁడు విషయములగోరనభిలక్షింపఁడు. ఆశీలువవేయఁబడిన జీసను మనహృదయమునఁ బ్రవేశించినయెడల సర్వసత్యముల వేగముతోఁ బూర్తిగా గ్రహించ గలుగుదుము. నిజమైన యీశ్వరభక్తుఁడు తనకు విధికృతములయిన సర్వవిషయములను జక్కగా భరింపఁగలిగియుండును. భక్తివిశ్వాసములులేని యీశ్వరోపాసకుఁడు పెక్కుకష్టములకు లోనయి సర్వవిధముల బాధపడుచుండును. ఎందుచేతననఁగా నాతఁడాంతర్యోపశమనమును

బొందఁజాలఁడు. బాహ్యవిషయములయం దట్టి యుపశమనము గలుగనేరదు. తగినశిక్షాపద్ధతి ననుసరించి జీవింపలేని యీశ్వర భక్తుఁడు కష్టపరంపరలకు లోనగుచుండును. సర్వస్వతంత్రుఁడయి సులభమార్గమున మెలఁగఁజూచువాఁడు యెల్లప్పుడు మిగుల వ్యథజెందవలసియుండును. ఏలయన నందేదయిన నొకవిషయము వానిని బాధింపకమానదు. ఇందుచేతనే పెక్కండ్రు భగవద్భక్తులు లోకవృత్తమును విడిచి యేకాంతస్థలములయందు మిగుల కచ్చితమయిన జీవితమునందు జీవించువారో యేకాంతప్రదేశమును విడిచి వెలుపల కరుదుగా జనుచుందురు. బాహ్యవిషయములఁ బూర్తిగా విసర్జించియుండిరి. వారు నిస్సారమైన యాహారమును భుజించియుండిరి. జీర్ణవల్కలములధరించిరి. మిగుల కఠినముగా పాటుపడుచుండిరి. మిక్కిలి మితమైన సంభాషణమును మిక్కుటమయిన మౌనవ్రతము గలిగియుండిరి. వారు ప్రాతఃకాలముననే లేచి తమకాలమునంతయు యీశ్వర ధ్యానమునందు సద్గ్రంథపఠనమునందును వినియోగించుచుండిరి. పాపకళంకమించుకంతయు తమ్ము నంటకుండుటకు మిగుల నిష్కర్షగా తమ్ము తాము కాపాడుకొనుచుండిరి. పూర్వకాలమున నెల్లమతములవారును నీశ్వరుని నామకీర్తనంబుల స్తుతించుటకు ననుదినము రాత్రులయం దెట్లు మేల్కొనియుండిరో యోచింపుము. ఈవిధముగా ననేకులయిన యీశ్వరభక్తు లీశ్వరునియం దానందించుచుండ యిట్టి మహాకార్యంబున నీవించుకయు శ్రమతీసుకొనక మాంద్యుఁడవై

కాలముగడపుచుండుట యెంతసిగ్గుపాటు. మనము సర్వకాల సర్వావస్థలయందును ప్రభువయిన యీశ్వరుని సంస్తుతించుట కన్న మనమాచరింపఁదగిన మహత్కార్యము వేఱొకటికలదా? ఆకలి, దాహము, నిద్ర మొదలయిన శరీరధర్మములు నిన్ను బాధించుచుండుటచే శరీరరక్షణార్థము నీవు పాటుపడ వలసియున్నందున నీవు నీజీవితకాలమును కొంతవఱకు నిరర్థకముగా గడుపవలసియుంటివి. ఆశరీరధర్మములు నిన్నింతమాత్రము బాధింపని యెడల నీ వెల్లప్పు డీశ్వరసేవారతుఁడవయి పరమార్థవిషయములయందు మునిఁగి హాయిగా సుఖించుచుందువు. ఈశరీరధర్మములు మనలబాధించనియెడల మనోవాక్కాయకర్మంబుల సర్వేశ్వరుని ప్రతిక్షణమున ధ్యానించుచుందుము. సేవించుచుందుము. పూజించుచుందుము. ఈశ్వరుఁడు తప్ప యితరచింత లేవియు మనహృదయమున గలుగనేరవు. అపుడు భుజించుట నిద్రించుట మొదలయిన పనులేవియు మనకవసరములేదు. మన మెల్లప్పుడును నీశ్వరుని సంస్తుతించుచుందుము. అధ్యాత్మికసాధనలయందు మాత్రమే మనజీవితమువంతయు వినియోగింపఁగలుగుదుము. ఈశరీరధర్మములు నిన్ను బాధించుచున్నప్పటికిన్నిని నప్పు డధికసంతోషముతో సుఖింపఁగలవు. ఈశరీరధర్మములు మనల నెంతమాత్రము బాధింపకున్నను పరమార్థత్వము మనకించుకంతయు రుచింపకున్నది.

మానవుఁ డీ సృష్టిపదార్థముల యుపశమనమును గోరక పావనత్వముయొక్క మహోన్నతస్థితికి రాఁగలిగినప్పుడు భగ

వంతుఁడు వానికి దనయందు పరిపూర్ణమయిన యభిరుచిని గలిగించును. అప్పుడాతఁడు ప్రపంచములోతనకేమి సంభవించినను సంతుష్టిగలిగియుండును. సుఖములకానందింపఁడు. కష్టములకు విచారింపఁడు. కష్టసుఖములు కలిమిలేములు మొదలయినవానియందు సమభావముగలిగియుండును. తన నిదానమంతయు నీశ్వరునియందుంచి సర్వమునకు వానిపై నమ్మియుండును. ఆతఁడు సర్వవిషయములయందును యీశ్వరునితో నన్యోన్యమయియుండుటచే వానిదృష్టికి చప్పుట నశించుట మొదలయిన దేమియులేక సర్వము నీశ్వరునియందు నిల్చి యీశ్వరేచ్ఛను నెఱవేర్చుచున్నట్లు కనుపించుచుండును. ప్రతిదానికి నంతమున్నదనియు గతించినకాల మెన్నటికి తిరిగి రాదనియు జ్ఞాపకముంచుకొనును. తగినంతజాగ్రతయు శ్రద్ధయు లేనప్పుడు యోగ్యత బొందఁగలుగుట యసంభవము. నీవు శ్రద్ధ గలిగియుండుటకు ప్రారంభించితివేని దుర్మార్గమున సంచరించుటకు సయితము ప్రారంభించుదువు. పావనజీవితమున జీవింపఁ బ్రారంభించితివేని మహత్తరమయిన చిత్తవిశ్రాంతిని గలిగియుండుటయే గాక యీశ్వరానుగ్రహముచేతను యోగ్యతయందు నీవుగలిగియున్న యాసక్తిచేతను నీవు పడుచున్న బాధలు తేలికగాఁ గనుపించుచుండును. శ్రద్ధయు నాసక్తియుఁ గలిగినమానవుఁడు సర్వవిషయములకు సంసిద్ధుఁడయి యుండును. కాఠిన్యమయిన కాయకష్టముకన్న దుర్మార్గము నడఁచిపెట్టుటకు దుర్వాంఛల నశింపుజేసుకొనుటకును మనకు

పొందవలసియున్న పరిశ్రమ యనేకప్రయాసకరముగా కనుపించుచున్నది. తనయందున్న స్వల్పదోషములను విచారించుకొనఁజాలనివాఁడు క్రమక్రమముగా గొప్పదోషములకు లోనుగావలసియుండును. నీవు దివసమంతయు లాభకరముగా గడుపగలిగితివేని సాయంకాలమున సంతోషముగా సుఖింపఁగలవు. నిన్ను నీవు ప్రతిదినము పరిశీలించుకొనుము. నిన్ను నీవు పురికొల్పుకొనుము. నిన్ను నీవు జాగ్రత్తపెట్టుకొనుము. ఇతరుల స్థితి యెట్లున్నను నిన్ను నీవుపేక్షింపకుము. నిన్ను నీవు బాధించుకొనుచున్న కొలఁదిని నీవధికముగా యీశ్వరవాత్సల్యమున నభివృద్ధిఁ జెందఁగలుగుదువు.

ప్రథమభాగము సమాప్తము.



# ఆంతరంగికజీవితము.

ద్వితీయ భాగము.



## 1 ఆంతర్యజీవితము.

"ఈశ్వరరాజ్యము నీయందు నున్నది" అని భగవంతుఁడుఁ జెప్పుచున్నాఁడు. నీవు హృదయపూర్వకముగా భగవంతునివంకకు మరలుము. విచారహేతువులైన యీప్రపంచకమును విడిచిపెట్టుము. బాహ్యవిషయముల పరిత్యజింప నేర్చుకొనుము. నీయాత్మ యపుడు విశ్రాంతిని గలిగియుండును.

బాహ్యవిషయముల పరిత్యజించి యాంతరంగికవిషయమును జూడనేర్చితివేని యీశ్వరరాజ్యము నీహృదయమున గనుపించుచుండును. నిర్మలాంతఃకరణమున బొడసూపుచున్న పావనమైన యానందమే యీశ్వరరాజ్యము. అది అపవిత్రహృదయమున గనుపించదు. నీవు నీయందర్హమైన యుత్తమభవనమును నిర్మించితివేని క్రీస్తు నిన్ను సమీపించి వానియుపమనము నీకు విదితపఱచును. సుందరమైనవాని తేజోవిశేషమంతయు దాని యంతరమున గనుపించుచున్నది. అందామహాత్ముఁడధికవికాసముతో నానందించుచుండును. ఆయ

న పెక్కుసారు లాంతర్యపురుషునికి దర్శనమిచ్చి మృదుమధుర స్వనంబున వానితో ముచ్చటించుటయేగాక వానికి దగిన యాత్మోపశమనమును సయితము గలిగించియుండెను. వానియాత్మయందు దగినంత విశ్రాంతిని బూరించి తనతో సధికపరిచయమును గలిగించుచుండెను. ఎల్లప్పుడు నీవు వానినిగూడియుండుటకు సిద్ధమైయుండుము; "ఎవరైన నన్ను బ్రేమించి నాయాజ్ఞను శిరసావహించి మెలఁగుచుండిరేని, నేను వారల సమీపించి యనిశంబు వారలతో నివసించుచుందును" అని ఆయన నుడివియుండెను. కావున జీససునకు నీహృదయమున నిలువ తావొసఁగి తదితరవిషయములను లోనజేరనీక నిరసింపుము. నీవు క్రీస్తును గలిగియుంటివేని యితరధన మవసరములేకయే మహాభాగ్యవంతుఁడవై ప్రకాశించుచుందువు. మనుష్యమాత్రులను గోర నవసరములేకయే నిరవసరములై యున్న సర్వవిషయములను నాతఁడు నీకు సందర్భపఱచుచుండును. మానవచిత్తము మిగుల దుర్బలమైనది. నిమిషమున కోటివిధముగా మారుచుండును. క్రీస్తు మనల సౌఖ్యదశయందైన విడిచిపెట్టక తోడునీడవలె మనల జేరియుండును. మానవుఁడును మనకెంత ప్రియతముఁడై యున్నను, వానివలన మనకెంత లాభమున్నను వాఁడు నాశనస్వభావమును గలిగియుండుటచే వానియందు నిలువగలిగిన గొప్పయాధారక్షేత్రము గనుపించదు. ఆతఁడు కొన్నిసమయములయందు మనకు బ్రతిబంధకముగానున్నను వైషమ్యముగానున్నను మనమందులకు విచారింప నవసరము

లేదు. మానవ చిత్తము గాలివలె తఱచు చలించుచుండు
టచే నేఁడు మనకు మిత్రుఁడుగానున్న వాఁడు రేపు మనకు
శత్రువుగా నుండవచ్చును. శత్రుఁడైనవాఁడు మిత్రుఁడై
యుండవచ్చును. నీనమ్మకము నంతయు సర్వేశ్వరునియందుమాత్ర
మే యుంచుము. నీవు భయపడఁదగినవాఁడును ప్రేమించదగి
నవాఁడును యీశ్వరుఁడే నని తెలిసికొనుము ఆతఁడుమాత్రమే
నీకొఱకు ప్రత్యుత్తర మివ్వఁదగినవాఁడు నీకు మేలుఁజేయఁ
దగినవాఁడు. నీకీలోకమున శాశ్వతనివాసస్థాన మేదియు లేదు.
నీవెచటనున్నను పరదేశివే. యాత్రికుఁడవే. అంతరంగమున నీవు
క్రీస్తుతో నన్యోన్యమై యున్ననే దప్ప చిత్తవిశ్రాంతిని గలిగి
యుండనేరవు.

ఈలోకమున నీవు నివసింప నవకాశము లేనప్పుడు నీదృ
ష్టినంతయు నీలోకవిషయములయందేల నిలిపెదవు? పరలోక
మే నీవు నివసింపదగిన నివాసము. ఈలోకవిషయములన్నియు
నీవు జనబోవుచున్న మార్గమధ్యమున తటస్థమగుచున్న పరిదే
శములని భావింపుము. ఈవిషయములన్నియు గతించఁదగినవే.
వానినంటితివేని నీవును వానితో గతింపవలసియుందువు. కావున
నీవు వాని నెంతమాత్రము నంటకుండుటకుఁ బ్రయత్నింపుము.
నీమనస్సునంతయు నామహోన్నత విషయమునందుమాత్రమే
నిలుపుము. నీధ్యానమును ప్రార్థనలను యెడతెగక క్రీస్తువంకకుఁ
బ్రవహింపఁజేయుచుండుము. మహోన్నతమైన పరతత్వమును
సాధింప నీకు శక్తిలేనప్పుడు క్రీస్తుయొక్క మనోభావము

-లను యోచింప గలిగియుందుము. పావనమైనవాని గాయముల యందానందముతో నివసింపుము. క్రీస్తుయొక్క తేజోవికాస మయిన గాత్రమును గాయములను నీవు సమీపించితివేని యాప దలయందు సహితము నీవధికముగా సుఖించుటయేగాక పరులు నిన్ను నిందించినప్పు డావంతయు కలతఁజెందవు. పరులు జేయుచున్న నిందలను దూషణలను నీవు సులభముగా భరింపఁ గలవు. క్రీస్తుసహితము యీలోకమున నివసించియుండెను. ఆయ నయు మానవులవలన దిరస్కరింపఁబడెను. దుస్సహమయిన కష్టస మయములయందు దూషణలతో విడిచిపెట్టఁబడెను. అట్లు వార లచే దిరస్కరింపఁబడుటకును బాధపడుటకును క్రీస్తు హృదయ పూర్వకముగా గోరియుండెను. కాన నీవట్టి విషయములలో నేల ప్రలపించెదవు. క్రీస్తుసహితము శత్రువులను కొండెగా డ్రను గలిగియుండెను. మానవులందఱు నీకు బరమమిత్రులై యుండవలెనని యేలతలచెదవు.

లోకములో శత్రువులును బాధలును లేనియెడల నీ యోరిమి జయముగలిగి ప్రకాశించుట కేమి యవకాశ ముండును? ప్రతిబంధముల గలిగియుండుటకు నీ విష్టపడనియెడల క్రీస్తు కనుచరుఁడవై నీ వెట్లు మెలఁగఁగలవు. నీవు క్రీస్తుతో రాజ్యమేల దలఁచినయెడల క్రీస్తువలెనే నీవును బాధలను కష్ట ములను ననుభవింపుము. నీవు క్రీస్తుయొక్క మనస్సుఁజొచ్చి ఆయన ప్రేమ నించుక చవిఁజూడఁగలిగితివేని నీయనుకూల ప్రతికూలముల నీక్షించుటయు పాటింపవు. కష్టములను జిర

స్కారములను ననుభవింప తరుణము దొరికినందుకు నీవు పర
మానందభరితుఁడ వగుచుందువు. ఏలయనఁగా క్రీస్తునందలి
ప్రేమ మానవుని తన్నుతాను తిరస్కరించుకొనునట్లుఁ జేయు
చున్నది. క్రీస్తునందును సత్యమునందును ప్రేమగలిగిన పరమ
భక్తుఁడు అనివార్యమైన మోహమును విడిచిపెట్టి తన్ను
తాను ఈశ్వరునివంకకు మరల్చుకొనఁగలిగియుండును. తనయా
త్మను మహోన్నతతత్వమునకుఁ గొనిపోయి యీశ్వరానుభవ
మును గలిగించుకొనుచుండును. విషయములను పేరునుబట్టియు
ప్రసిద్ధినిబట్టియు పరిగణింపక వాని నిజమైన విలువనుబట్టి పరి
గణింపనేర్చినవాఁడు నిజమైన జ్ఞానవంతుఁడు. అతఁడు మానవ
తత్వముకంటె యీశ్వరతత్వమును జక్కఁగాఁ దెలిసికొనిన
వాఁడు. బాహ్యవిషయముల నెంతమాత్రము పాటింపక అంత
రంగిక జీవితమున జీవింపనేర్చిన యుత్తమపురుషుఁడు దేశకాల
నియమము లవసరము లేకయే యీశ్వరోపాసన యొనర్ప సమ
ర్థుఁడై యుండును. నిజమైన జ్ఞానవంతుఁడు తన్ను దాను దెలి
సుకొని బాహ్యవిషయముల నెంతమాత్ర మంటకుండును.
వానికి బాహ్యవృత్తి యెంతమాత్రము ప్రతిబంధకమును గలి
గింపనేరదు. కాలమునుబట్టి యవసరములై యున్న బాహ్య
వ్యాపారము లెట్లు పరిణమించినను విచారమునొందక వాని
కనువుపడి యుండును. మంచిశిక్షచే నంతరంగమును జక్కఁగాఁ
బ్రవర్తింపఁజేయువాఁడు | మానవుల కుటిలవర్తనము నించుక
యు పాటింపఁడు. బాహ్యవిషయములఁ దగిలినకొలఁదిని మాన

పునకుఁ బ్రతిబంధకము లతిశయించి మనోవ్యథ నొందుచుం డును. నీహృదయము దోషమాలిన్యము నంటక నిర్మలముగా నున్నప్పుడు ప్రతివిషయము నీలాభమునకును నభివృద్ధికిని కారణమైయుండును. నీయహంభావము పూర్ణముగా నశించ నప్పుడును లోకవిషయములయందు నీ వనురాగమును గలిగి యున్నప్పుడును ననేకవిషయములు నీకు వికలమునుఁ బుట్టిం చుచుండును.

అపరిశుద్ధమైన మోహముకంటె మానవహృదయము ను భ్రష్టీకరింపఁజేయఁ గలిగినదేదియు లేదు. నీవు బాహ్యోప శమనమును నిరాకరింపఁగలిగినయెడల పరమార్థమును విచా రింపఁగలుగుటకును ఆంతరంగిక యానందము ననుభవించుట కును సమర్థుఁడవై యుందువు.

## 2 అడఁకువ.

ఒరులు నీకనుకూలముగా నున్ననుఁ బ్రతికూలముగాను న్నను నది యొక్క గొప్పవిషయమని భావింపకుము. నీవు చేయుచున్న ప్రతికార్యమునందును నీశ్వరుఁడు నీతో నుండు నట్లు దగినంత జాగ్రతతో మెలఁగుచుండుము. పావనమైన యంతఃకరణమును గలిగియుండుము. ఈశ్వరుఁడు నిన్నుసిశంబు గాపాడుచుండును. భగవంతునకుఁ బరమమిత్రులై యున్నవా రిని మానవుని కుటిలస్వభావము బాధించనేరదు. నీవు బాధిం పఁబడుచున్నను మౌనమును గలిగియుంటివేని ప్రభువుయొక్క

సహాయమును బొందఁగలుగుదువు. నిన్నుద్ధరించవలసిన సమయమును రీతిని ఆయనకు విదితమే కనుక నిన్ను నీ వాయనకు వశపఱచి యూరకుండుము. కలవరములనుండియు బాధలనుండియు మనల రక్షింపవలసిన భార మీశ్వరునియందున్నది. మన తప్పిదములను గాంచినప్పు డితరులు మనల దూషింతురన్న పరిజ్ఞానము మన హృదయమునకు దైన్యమును గలిగింప మంచి సాధనమైయున్నదని తెలుసుకొనుము. మానవుఁడు తన దోషమును గుర్తెఱిఁగి దైన్యస్వభావమును గలిగియున్నప్పుడితరులను సులభముగా శాంతింపఁజేయఁగలిగి యుండుటయే గాక వారు తమ్ముల బాధించినప్పుడుసహో దానిని సహనముతో భరించఁగలిగియుందురు. భగవంతుఁడు దీనుల నుద్ధరించి రక్షించుచుండును. దీనులే భగవంతునకు మిగుల ప్రియమైనవారు. ఆయన వారల నెల్లవిధముల కాపాడుచుండును. దీనుల దీనాలాపముల నాలింప నాతఁడు సదా చెవియొగ్గి వేచియుండును. తన దయారసమును దీనులపై వెదఁజల్లుచుండును. దీనులు దైన్యముచేఁ గ్రుంగినప్పుడు వారలఁ బైకి లేవఁదీయును. భగవంతుఁడు తనరహస్యములను దీనులకు మాత్రమే తెలియఁజేయుచుండును. తనమాధుర్యమును వారలకుఁ జవిచూపి తన చెంతకు వారలఁ జేరఁబిలచుచుండును. దీనజనుని వదనారవిందము కలవరముల సహించుచున్నను వానిహృదయము విశ్రాంతి గలిగి నెమ్మదిగానుండును. ఎందుచేతననఁగా వానిహృదయ మెల్లప్పు డీశ్వరునియందు విశ్రమించుచున్నదిగాని తదితరము

నందు విశ్రమించుచుండలేము. లోక మందఱికన్నను నీవు తక్కువగానున్నట్లు భావింపగలిగిననేతప్ప నీవు జ్ఞానమునం దభివృద్ధిజెందియున్నట్లు యోచింప వీలులేదని తెలిసికొనుము.

8 యోగ్యతను నెమ్మదిని గలిగియున్న మానవుఁడు.

మొట్టమొదట నీ హృదయమున నెమ్మదిగలిగియుండు ము. ఆవల నీ వెల్లరకు నెమ్మదిని గలిగింపఁగలవు. విద్యాధికుఁ డయిన పండితునికంటె నెమ్మదిగలమానవుఁడు లోకమున కెక్కుడు యుపకారమును జేయఁగలిగియుండును. కోపస్వభావముగలపురుషుఁడు కొన్నిసమయములయందు చెడ్డకార్యముఁను మంచికార్యముగాఁ జేయఁగలిగినను నాతఁడు చెడుగును విశ్వసించుటకు సిద్ధమయియుండును. నెమ్మదిగలిగిన శాంతపురుషుఁడు ప్రతికార్యమును మంచిగా పరిణమింపఁజేయఁగలిగియుండును. అతఁడితరుల నెన్నడును సంశయింపఁడు. సంతృప్తిలేని కోపమానసుఁడు పెక్కుయనుమానములవలనను సంశయములవలనను మనోవికలమును గలిగియుండును. అతఁడెన్నడును నెమ్మదిగలిగియుండఁడు. ఇతరులను నెమ్మదిగలిగియుండనీయఁడు. చిత్తశాంతిలేనిమానవుఁడు తాను చెప్పవలసియున్న సంగతులను జెప్పకుండుటయేగాక చెప్పఁగూడనిసంగతులను తలఁచు చెప్పుచుండును. చేయవలసినకార్యములను జేయక విడిచిపెట్టుచుండును. తాను జేయవలసియున్నవిధాయకకార్యములనుపేక్షించి తనకవసరములేని యితరులకార్యములయందుఁ బ్రవేశించుచుండును. నీచలమునంతయు ముందు నీయం

దు వినియోగింపఁ బ్రారంభింపుము. అనంతరము నీవు దానిని యుక్తముగా నీ తోడి మానవులకు వ్యాపింపఁజేయవచ్చును. నీదోషములను నేరములను నెట్లు మఱుగుపఱచవలయునో నీ వెఱుఁగుదువు. ఇతరులు తమ నేరములను క్షమింప వేఁడినప్పుడు నీ బంధులకు సమ్మతించుట కిష్టపడవు. నీ నేరములకు నిన్ను శిక్షించుకొనుటయు నీ సోదరుని నేరమును క్షమింపఁజూచుటయు మిగుల శ్లాఘనీయములయి యున్నవి. నిన్ను దప్ప యితరుల నెన్నఁడును కోపించుటకును, ద్వేషించుటకును సమ్మతింపనేరనియు తమస్థితికి నీహృదయ మెంత దూరముగా నున్నదో పరిశీలించి చూచుకొనుము. యోగ్యులమధ్యను, శాంతులమధ్యను నెమ్మదిగలిగి జీవించుట ఘనకార్యము గాదు. ఇది స్వాభావికముగా సంగతికి నిర్బాధకమగుటచే నానందకరమయినది. తమ కనుకూలమయినవారితో నివసించుటకును నెమ్మదిగలిగియుండుటకును నెల్లవారు సమ్మతింతురు. అనుజ్ఞల నెఱుంగని మూఢమానవులమధ్యను, తనకు వైషమ్యముగా సంచరించుచున్న శత్రుమధ్యమునను నీవు నెమ్మదితో జీవింపనేర్చియుండుట మిగుల యభినుతింపఁదగిన యద్భుతవిషయము. మానవపవిత్రతకు వన్నెఁ దెచ్చు పౌరుషకృత్యము. తమ హృదయములయందు నెమ్మదిగలిగియుండుటయేగాక యితరులతో నయితము నెమ్మదిగా జీవింపఁగలిగినవారు కొందఱు గలరు. లేకమైన తమహృదయములయందు నెమ్మదిని గలిగియుండక యితరులనెమ్మదికి నయితము భంగమును గలిగించుచున్నవారు

కూడ గలరు. అట్టి వారితరులకు దుర్భరమయియుండుటయే గాక తమకుసహితము భారముగా నుందురు. తమహృదయమున నెమ్మదిగ గలిగియుండి యితరులహృదయములకు సహితము నెమ్మదినిగలిగింపఁ బ్రయత్నించువారు మఱికొందఱు గలరు. ఈజీవితమున మనము గలిగియున్న నెమ్మదియంతయు మన కనిష్టవిషయములను మిగుల యడఁకువ గలిగి భరించుట యందున్నదిగాని వానిని దప్పించుకొనుటయం దెంతమాత్రము లేదు. యుక్తముగా యోర్పుతో సహింపనేర్చినవా రపారమయిన చిత్తశాంతి ననుభవింపఁగలరు. అట్టి యుత్తమపురుషుఁ డొక్కరుఁడుమాత్రమే తన్ను దాను జయించఁగలిగిన మహాశూరుఁడు ఈప్రపంచకమునంతయు స్వాధీనము జేసికొని పరిపాలించుచున్న పౌరుషవంతుఁడు జీససుక్రీస్తుయొక్క పరమమిత్రుఁడు. ఈశ్వరరాజ్యమునకు ముఖ్యవారసుఁడు.

## 4 నిర్మలహృదయము.

పావనత్వము నిష్కాపట్యము, అను రెండుఱెక్కలతో మానవుఁ డీలోకమును విడిచి పరలోకమున కెగయఁగలిగి యుండును. నిష్కాపట్య ముద్దేశమునందును పావనత్వము మోహమునందును నుండవలయును. నిష్కపటము భగవంతుని యందు నిదానమును గలిగించును. పావనత్వము భగవంతుని నాలింగనము గావించి వాని మాధుర్యమును జవిచూపఁగలిగి యుండును. నీ హృదయమున స్వార్థపరత్వమును విడిచిపెట్టితి

వేని సత్కార్యాచరణము నీకుఁ బ్రతిబంధకమయి కనుపించదు. నీయుద్దేశమునందు భగవంతుని సంతోషపెట్టుట తప్ప వేఱు చింత మఱియొకటి లేనప్పుడును భావమునందు తోడిమానవు నకు మేలుజేయుటకంటె మాఱుతలంపు గదియనప్పుడును, అం తరంగము యొక్క స్వేచ్ఛాభావమును నీవు బొందఁగలుగుదువు. నీయంతఃకరణము నిర్మలమయియున్నప్పుడు ప్రతిజీవము నీకు జీవితదర్పణమువలెను పావనోపదేశముల నుపదేశించెడి యు ద్గ్రంథమువలెను గనుపించుచుండును. భగవంతునియొక్క సదుద్దేశమును వెల్లడింపని జీవమేదియు లేదు. ఎంతక్షుద్ర జంతువయినను నీశ్వరప్రభావమును సూచింపకుండుట లేదు. నీహృదయము నిర్మలముగా నున్నప్పుడు యడ్డులేకయే నీవు సర్వమును జూడఁగలవు. సర్వమును జక్కగా గ్రహింపఁగలవు. పరిశుద్ధహృదయము స్వర్గనరకముల రెంటిని జొచ్చి జూడగల దు. మానవుని బాహ్యవిషయవిచారణనాని మానసస్థితి ననుస రించియుండును. సంతోషమువంటి పదార్థమేదైన లోకము లో నున్న యెడల పరిశుద్ధహృదయముగల మానవుఁడుమాత్ర మే దానిని నిశ్చయముగా బొందఁగలుగచుండెను. ఎచ్చట నయిన కలవరము, వైకల్యము మొదలయిన విషయములుండ సంభవించెనేని చెడుహృదయము దాని నధికముగా ననుభవింప వలసియుండును. ఇనుము నగ్నియం దుంచబడినప్పు డగ్నికాక చే దాని తుప్పు విడిచి ధవళకాంతి ప్రకాశించుచున్నట్లు మాన

వ్రుఁడు ప్రాపంచికకష్టముల నోర్చి పూర్ణముగా దేవత్వము నొందినప్పుడు మాంద్యమును, మాలిన్యమునువిడిచి నూతన పూరుషుఁ డగుచుండెను. మానవుఁడు మాంద్యమునొంద ప్రారంభించునప్పుడు నిరర్థక పరిశ్రమవలన బాహ్యోపశమనముల కభిలషించుచుండును. కాని, యాతఁడు మాంద్యమును విడిచి తన్ను తాను జయింపఁబ్రారంభించునప్పుడును మగతనముగలిగి యీశ్వరమార్గమున నడువఁబ్రయత్నించునప్పుడును, అంత వఱకనివార్యములుగాఁ గనుపించుచున్న కష్టములు బహుసులభసాధ్యములయి కనుపించుచుండును.

## 5 ఆత్మవిచారణ.

మనము తఱుచు భగవదనుగ్రహము పొందలేక పోవుచుండుటచేతను, తగినంత జ్ఞానము లేకపోవుటచేతను మన శక్తిపై నాధారపడియుండుటకు వీలు లేక పోవుచున్నది. మనయందు గనుపించుచున్న జ్ఞానము మిగుల స్వల్పమైనది. అశ్రద్ధవలనను నుపేక్షవలనను దానినిసయితము మనము పోఁగొట్టుకొనుచుంటిమి. మనయంతర్గతమునందలి యంధత్వమును గనిపెట్టనేరక మనము తఱుచు తప్పుచేయుచుందుము. అందుకు మనము చెప్పుచున్న సమాధానము లంతకన్నను నధికఘోరములుగా గనుపించుచుందును.

ఒకప్పుడు మనము లోలత్వముగలిగియుందుము. దానిని నుత్సాహమని పరిభ్రమించుదుము. మనయందునున్న గొప్ప

దోషములను పాటింపక మనమితరుల స్వల్పదోషములను దూ
షించెదము. ఇతరులవలన మనకించుక బాధ తటస్థించెనేని
యతివేగముగా నొప్పిగలిగి దానిని మఱచిపోక యెల్లప్పుడు
జ్ఞాపకముంచుకొందుము. కాని, మనవలన నితరులకు నొప్పి
గలిగినప్పుడు దాని నించుకయు దలంపము. తనచేష్టలను మనో
భావములను జక్కగా విచారింపఁగలిగినవాఁడు. ఇతరులను
గూర్చి యెంతమాత్రము విచారింపడు.

నిజముగా నీశ్వరజ్ఞానము గలిగినమానవుడు యితరుల
వ్యాపారమునను విచారించుటకు బదులుగా తన యాత్మనుగూ
ర్చి తగిన జాగ్రతను దీసుకొనుచుండును. తన్నుగూర్చి జాగ్ర
తతో శ్రద్ధగలిగి యున్నవాడితరుల యెడ మౌనమును వహిం
చి యుండును. ఇతరుల విషయములో మౌనముధరించి నిన్ను
గూర్చి నీవు తగిన జాగ్రతను దీసుకొనుచున్న నే తప్పనీకధ్యా
త్మిక జ్ఞానమును భక్తిభావమును లభింపనేరవు. నీవుపూర్ణము
గా భగవద్విషయమునే గమనించుచున్న యెడల బాహ్యవిష
యములునిన్నింతమాత్రము నంటజాలవు. నిన్ను విడిచి నీవెచ
ట మెలగ గలవు? నిన్ను నీవుపేక్షించి యపారమైన లోకవిష
యముల యోజించుటవలననీకేమి ప్రయోజనము? నీవు చిత్త
విశ్రాంతిని గలిగి నిజముగా నీశ్వరునితో నవినాభావ సంబంధ
మును గలిగియున్న యెడల యితర యోజనల నన్నిటిని విడిచి
పెట్టి యధ్యాత్మిక జీవితమునకు బ్రియత్నింతువు. అస్థిరపదా
ర్థములను చింతించక విడిచిపెట్టితివేని యధ్యాత్మిక జీవితమునం

దు గొప్ప యభివృద్ధి నొందగలిగి యుందువు అశాశ్వతపదార్థ ములన భిలషించితివేని నీయభివృద్ధికి భంగము గలిగించుకొందు వు. భగవంతుడు దక్కతదితరమైన దేదియు మహత్తరమైనదని యోజింపకుము. దేనిని ప్రేమింపకుము. దేనిని నంగీకరింపకుము. ఈశ్వర సంబంధము దప్ప యితర సంబంధము, దేనిని గలిగియుం డకుము. మానవులవలన మనకు లభించెడి సుఖము నిరర్థకము. భగవంతుని ప్రేమించు మనుష్యహృదయము భగవద్వ్యతిరేకమై న విషయముల గర్హించుచుండును. భగవంతుడు మాత్రమే శాశ్వతము మహాహృదము సర్వమునకు లోపలను వెలుపలను నిండియుండెను. ఈశ్వరుడే ఆత్మోపశమనము హృదయము యొక్క పరమానందము.

## 6 పావనాంతఃకరణము.

యోగ్యునియొక్క యానందము అంతరాత్మవలన లభిం చిన యోగ్యతాపత్రిక యని తెలుసుకొనుము. పావనమైన యంతఃకరణమును గలిగియుంటివేని నీవెల్లప్పుడు సుఖించుచుం దువు. యోగ్యమైన హృదయము కష్టసమయములయందు నయి తము మంచి సహనమునుగలిగి మిక్కుటమైన యానందముతో విరాజిల్లుచుండును. చెడుహృదయ మెల్లప్పుడు పిఱికిదనము గలి గి విశ్రాంతి లేక బాధపడుచుండును. నీవంతరాత్మవలన తిర స్కరింపఁబడలేని చిత్తవిశ్రాంతియొక్క మాధుర్యమును జవిజూ డఁగలవు. నీవుచక్కగాఁ బ్రవర్తింపఁగలిగిననేతప్ప బాగుగా సు ఖింపనేరవు. దుర్మార్గులెప్పుడును నిజమైన యానందమును బడ

యనేరరు. వారు చిత్తవిశ్రాంతినైన బొందఁజాలరు. "దుర్మార్గులెప్పుడును విశ్రాంతిని గలిగియుండరు" అని ప్రభువు చెప్పెను. దుర్మార్గులేమి చెప్పుచుండిరి? "మేము చిత్తవిశ్రాంతిని గలిగియుంటిమి. మాకేకీడును మూడుటలేదు. మమ్ముల నెవరు బాధింపఁగలరు?" అని వారు నుడువుచున్న యసత్య ప్రలాపములను చెవియొగ్గి వినకుము. వారి నుడువులు నసత్యములని భావింపకుము. వారు భగవంతుని యాగ్రహమునకుఁ బాత్రులై యుండుటచే చేష్టలు నిరర్థకములై యుండును. వారి తలంపులు వ్యర్థములయి నశించును. వారు తుదకు తమపాపఫల మనుభవించుచుందురు. ఆపత్కాలమునందు సంతోషింపఁగలుగుట యీశ్వరుని ప్రేమించుచున్న వారికి కష్టమైన విషయముగాదు. ప్రభువుయొక్క శిలువయందలి యానందమే యానందము. మానవుల వలన మనకు లభించెడి యానందము క్షణభంగురము. ప్రపంచక సంబంధమైన యానందము దుఃఖముచే వెంబడింపఁ బడుచుండును. యోగ్యునియొక్క యానందము ముఖమునందు గాక హృదయమునందు మాత్రమే ప్రకాశించుచుండును, సత్పురుషులు భగవంతుని యందు మాత్రమే యానందించుచుందురు. భగవంతుఁడే వారియానందము. వారు సత్యముగా నానందించుచుందురు. నిజమయిన శాశ్వతానందమును బడయఁగోరువారందఱును నస్థిరపదార్థముల నపేక్షింపక విడిచిపెట్టవలెను. ప్రాపంచిక సుఖముల నభిలషించువారు వానిని హృదయపూర్వకముగా నిరసింపనేరక పోవుటయేగాక పరతత్వమును ప్రేమింపలేక

పోవుచుండిరి. దూషణ భూషణములపాటింపని వాడు చిత్తవిశ్రాంతి గలిగియుండును. ఎవని యంతఃకరణము పరిశుద్ధతగలిగి ప్రకాశించుచుండునో అట్టివాఁడు మనస్సాంత్వ ప్తిని సులభముగాఁబొందఁగలిగి యుండును.

నీవితరులచే శ్లాఘింపఁబడినంతమాత్రమున యోగ్యుఁడవును దూషింపఁబడినంతమాత్రిచే నయోగ్యుఁడవునుగాఁజాలవు. నీవు నీవే. నీమంచిచెడ్డలు నీహృదయముయొక్కస్థితి ననుసరించియుండును. లోకులు పొగడిన పొగడ్తలు నీకు యోగ్యతనుగలిగింపనేరవు. నీవెవరవో నిన్ను జూచుచున్న యీశ్వరునికేతుక హృదయమున నీవెవరవనునది నీయంతరాత్మయే చెప్పుచున్నది. నీవు దానిని వినఁగలిగితివేని నిన్నుగూర్చి యితరులు చెప్పకొనుచున్న దానిని నీవువిన నపేక్షింపవు. మానవుఁడు నీముఖమును మాత్రమే జూడఁగలఁడు. భగవంతుఁడు నీహృదయమును పరీతము జూడగలడు.

మానవుఁడు నీపై చేష్టలనుమాత్రము జూడఁగలఁడు.భగవంతుడు నీయోచనలను భావములను జూడఁగలతనయందు నిరసనభావమునువహించి లోకమునకు మేలుజేయుచుండుట యణకువగలిగియుండుటకుగుఱుతు. మానవునినుండి యేయుపకారమును నపేక్షింపకుండుట పావనత్వమునకును ఆంతర్యవిశ్వాసమునకును చిహ్నము. మానవుల మెప్పుగోలకు ప్రయత్నింపనివాడు తనయాత్మను భగవంతున కర్పించెననుట యదార్థము

"ప్రభువుయొక్క మెప్పునపేక్షించువాఁడు మానవుల మెప్పుఁ బేక్షింపఁడు." అని యొకబుద్ధిమంతుఁడు నుడివియుండెను. అంతరంగము నీశ్వరునితో మెలఁగుచుండుటయు ప్రపంచవిషయములకు విముఖమయిన మనస్సును గలిగియుండుట యజ్ఞానవంతుని లక్షణములు.

7 జీససును బ్రేమించుట.

జీససునిమిత్తము తన్ను తాను నిరసించి జీససునుఁ బ్రేమింపనేర్చినవాఁడు నిజముగా సదృష్టవంతుఁడు. మనము ప్రేమించుచున్నవానికి మఱకు మిగుల ప్రియతమమైనదానిని విడిచిపెట్టవలయును. ఎందుచేతననఁగా జీసను అన్నిటికన్నను నధికముగాఁ బ్రేమింపఁదగియుండెను. ఇతరజీవుల ప్రేమ ప్రమాదమైనది. అస్థిరమైనది. చంచలస్వభావముగలది. జీససుయొక్క ప్రేమ విశ్వాసకరమైనది. సహానస్వభావము గలది. ఇతరజీవుల నంటియున్నవారు నోడల నంటిన ఘూళివలె క్రిందపడుదురు. జీససును నంటిపట్టినవారు పతనము లేక యెల్లప్పుడు స్థిరముగా నిలచియుందురు. కనుక నీవు జీససునుఁ బ్రేమింపుము. వానిని పరమమిత్రునిగాఁ జేసికొనుము. ఎస్నేహితులందఱు నిన్ను విడిచిపెట్టినను ఆయన నిన్ను విడిచిపెట్టక నీపక్కను నిల్చి నిన్ను నశింపనీక రక్షించుచుండును.

నీకిష్టమున్నను లేకున్నను నీవొకానొకదినమున సర్వమును విడిచిపెట్టవలసియుండును. నీవు జీవించుచున్నను చచ్చుచున్నను జీససును నీసామీప్యమున నుంచుకొనుము. విశ్వాస

నీయమైన యీమహామహుని రక్షణమునకు నిన్ను నీవు సమర్పింపుము. నిన్నెవ్వరును రక్షింపఁజాలనప్పు డా మహాత్ముఁడు మాత్రము నిన్ను రక్షింప సమర్థుఁడై యుండును. నిన్ను ప్రేమించుచున్న ప్రేమాపినిస్వభావమును విచారింపుము. నిన్ను రక్షింప వానికి సమానుఁ డెవ్వఁడును లేఁడు. ఆతఁడు నీ యాత్మను స్వయముగా స్వీకరించి సింహాసనాసీనుఁడైన మూర్ధాభిషిక్తునివలె దానియం దధిష్ఠించియుండును. ఈసృష్టింపఁబడిన జీవులన్నియు నిన్ను విడిచిపెట్టినను ఆయన నిన్ను విడిచిపెట్టక నీయందు నివసించియుండును. నీవు జీససును విడిచి మానవుని నమ్మితివేని నీవు చెడినవాఁడవగుదువు. గాలికిఁ జలించుచున్న తృణకాష్ఠమును నానుకొనియుండకుము. ఈశరీరములన్నియు తృణప్రాయములు. వాని యానందము గహనకుసుమమువలె క్షణకాలములో వాడిపోవును. మానవునిపై రూపమునుఁజూచి యానందించితివేని నీవు త్వరలో మోసపోవుదువు. ఇతరులనుండి నీవు లాభముబొందఁ జూచినను నుపశమింపఁబడఁగోరినను నీవు నష్టము ననుభవింపవలసియుందువు. నీ వన్ని విషయములయందును జీససుకొఱకుఁ బ్రయత్నించితివేని, నీవు నిశ్చయముగా జీససునుఁ జూడఁగలిగియుందువు. నీకొఱకు నీవు ప్రయత్నించితివేని నీవు చెడుటకు నిన్ను నీవు ప్రేరేపించినవాఁడవగుదువు. ఈ యావత్ప్రపంచకముకన్నను మానవుఁడు తనకుఁ దానే శత్రువు. జీససును కనిపెట్ట ప్రయత్నింపనివాఁ డితర శత్రువులందరికన్నను తనకు తాను గర్భశత్రువై తన్ను తాను మిగుల వేధించుకొనుచుండును.

## 8 జీసస్సుమైత్రి.

జీససునీకు సాక్షాత్కరించినయెడల సర్వవిషయము లనుకూలము లయియుండు. జీసస నీకుఁ గనుపించనియెడలసర్వము నీకుఁ బ్రతికూలమయి యుండును. జీసస నీయాత్మతో సంభాషింపనియెడల యితరోపశమనములన్నియు నిష్ప్రయోజనములై యుండును. జీసస నీతో నొకమాటు మాత్రము మాటాడినయెడల యది నీకధిక సుఖమును గలిగింపఁగలిగి యుండును.

పూర్వమొక్క సుందరాంగి (Mary Magdalene) విచారముచేఁ గుందుచున్నప్పుడు "ప్రభువువచ్చి నీకొఱకుఁ బిలుచుచుండె" నని నుడివినతోడనే యామె యానందముతో లేచియుండ లేదా. జీసస నీమనోవికలమును బాపి యధ్యాత్మిక సుఖమునకు నిన్నుఁ బురికొల్పినప్పుడు నీవెంత యానందించు దువు. ఆసమయము నీకెంత హాయిగానుండును. నీవు జీససును చింతింపక విడిచిపెట్టునప్పుడు నీ కాసమయమెంత కాఠిన్యముగాను నిరుత్సాహముగాను గనుపించుచుండును. ఈప్రపంచక మంతను బోఁగొట్టుకొనుటకన్నను నిది గొప్పయరిష్టము. జీససును విడిచిపెట్టినయెడల ప్రపంచకమంతయు నీ కేమిలాభము? జీససునుగూడియుండుటయే స్వర్గము. జీససునువిడిచియుండుటయే నరకము. జీసస నీతోనున్నప్పుడు శత్రులెవ్వరును నీకు హాని జేయఁజాలరు. జీససును కనిపెట్టుట మహాధనమును కని ట. ఈప్రపంచకలాభము లన్నిటికన్నను నది యెక్కువ

లాభము. జీసునువిడిచి పెట్టుట సర్వారిష్టములకన్నను నెక్కువ నష్టము. జీసుతో మైత్రికలిగి బ్రతుకఁగలిగినవాఁడు సకల సౌభాగ్యసంపన్నుఁడు. మహాధనవంతుఁడు. జీసునువిడిచి బ్రతికినవాఁడు పరమదౌర్భాగ్యుఁడు. జీసుతో సంభాషించెడి విధానమును నేర్చుకొనుటయె గొప్ప శాస్త్రపరిజ్ఞానము. వానిని హృదయమందు నిలుపఁగలుగుటయే మహత్తరమయిన పరిజ్ఞానము. నీవు భక్తివిశ్వాసములతోఁ బూరింపఁబడిన నిర్మలభావమును గలిగియుంటివేని జీసు యెల్లప్పుడు నీయందు నిలిచియుండును. నీవు వినయవిధేయతలుగలిగి నిర్మలమైనశాంతహృదయముతోఁ బ్రకాశించుచుందుము. జీసు నీకు సాక్షాత్కరించును. నీవు జీసునువిడిచి బాహ్యవిషయములకు మరలితివేని ఆయనను నీ హృదయమునుండి పరిత్యజించి వాని యనుగ్రహమునకు దూరమయి దుఃఖింతువు. నీవు నీ హృదయమునుండి వానిని ద్రోఁగొట్టినతరువాత ఎవరికడకుఁ బరుగులిడుదువు? ఎవరిని రక్షింపవేడుదువు? ఎవరితో స్నేహింతువు? మిత్రుఁడొకఁడు లేనియెడల నీవు బ్రతుకనేరవు. ఈలోకములో మిత్రులందఱి మైత్రికన్నను జీసుమైత్రి నీకు పరమరంజకముగా నుండదేని నీ వధికపరితాపమున దుఃఖింపవలసియుందువు. నీ వితరులను నమ్మి స్నేహింప నుత్సహించితివేని నీవవివేకముతో సంచరించినవాఁడవగుదువు. జీసుయొక్క యనుగ్రహమునకు దూరముగా నుండుటకంటె లోకమందఱితోను శత్రుత్వమును వహించియుండుటయే మేలెన్న. లోకమంద

టికన్నను నెక్కుడు ప్రేమతో జీససును బ్రేమింపుము. అందఱి కన్నను నాయన నిన్నెక్కుడు ప్రేమతో నాదరించుచుండును. లోకమందఱిని జీససుకొఱకు బ్రేమింపుము. జీససును జీససు కొఱకుమాత్రమే ప్రేమింపుము. లోకములోని స్నేహితులం దఱికన్నను జీసస క్రీస్తు మనకుఁ బరమమిత్రము. కనుక వానిని లోకమందఱికన్నను నత్యధికముగాఁ బ్రేమింపవలయును. వాని యందు మనకు శత్రుమిత్రులందఱును ప్రియములే. వానికొ ఱకు మనశత్రువులను మిత్రులుగా నెంచి ప్రేమింపనేర్చుకొన వలయును. వారియుభయులక్షేమము నిమిత్తము మన మీ శ్వరుని వేడుకొనుచుండవలయును. వారందఱు నీశ్వరభక్తి గలిగి సుఖింపఁగోరుచుండవలయును. ఎవనివల్లగాని నీవు గాఢ ముగాఁ బ్రేమింపఁబడుటకును, పూజింపఁబడుటకును నిష్టపడ కుము. అట్టిగౌరవము భగవంతునికిమాత్రమే యర్హమయినది. నీహృదయమునంతయు భగవంతునియందుదక్క తదితరవిష యమునందుంచ నభిలషింపకుము. ఇతరుల హృదయమంతయు నీయందు నిలచియుండవలయునని నయితము కోరకుము. నీహృ దయము నితరులహృదయము జీససునే ప్రేమించుచుండ వలయునని తలంపుము. మానవులయందపరిశుద్ధమయిన మో హమును గలిగియుండక పరిశుద్ధమయిన నిర్మలాంతఃకరణమును గలిగి హృదయమున స్వేచ్ఛాభావమును బొందియుండుము. చిత్తవిశ్రాంతిగలిగి ప్రభువుయొక్క మాధుర్యమును జవిఁజూడఁ గోరినయెడల నీవు సర్వసంగపరిత్యాగివై నీ పావనహృదయము

ను గొనితెచ్చి జీసస్సునర్పింపుము. జీసస్సుయొక్క యనుగ్రహామున్నుగలిగియున్ననే తప్ప నీవీస్థితి నెన్నడు బొందజాలవు. నీవు సర్వసంగపరిత్యాగము జేసి యేకాకివైయున్ననే తప్ప అద్వితీయుమయిన నీశ్వరుని గూడియుండజాలవు. ఆయీశ్వరవాత్సల్యము మానవునకు లభించినప్పుడు మానవుడేకార్యమునైన జేయసమర్థుడై యుండును. అది వానికి దూరమయియున్నప్పుడు పరమదరిద్రుడై బందర్పముబాసి నరకబాధలనుభవింపవలసియుండును. అట్టిసమయమున నీవు నిరాశజెంది కృశించియుండక యీశ్వరేచ్ఛననుసరించి జీసస్సు యనుగ్రహముకొఱకు నీకేమితటస్థించినను దానిననుభవింపసిద్ధముగా నుండుము. కృష్ణపక్షానంతరమున శుక్లపక్షమును శీతకాలావసానమున నుష్ణకాలమును సంభవింపకతప్పదు.

9 ఉపశమనశూన్యము.

నీ వీశ్వరోపశమనమును బొందగలిగినప్పుడు మానవోపశమనమును దిరస్కరింపగలుగుట యొకఘనకార్యముకాదు. మానవోపశమనమువలెనే యీశ్వరోపశమనము నయితము లభించనప్పుడు దానిని భరింపగలిగియుండుటయే ఘనకార్యము. మన మీశ్వరుని ప్రేమించియుండుటచే మనయంతరంగము శూన్యమయియున్నందుకు మనమెంతమాత్రము వ్యధజెందక సంతోషపూర్వకముగా దానిని భరింపనేర్చి యుండవలయును. కర్తృత్వాభిమానమును గలిగియుండుటకెన్నడును బ్రయత్నింపకుము. ఈశ్వరానుగ్రహమును నీవు బొందగలిగినప్పు డీశ్వ

కునియందు భక్తివిశ్వాసములు గలిగియుండుట యేమి వింత? ఈశ్వరానుగ్రహము గలిగియున్న నందఱు సంతోషించుదురు.

భగవదనుగ్రహము గలిగియున్నంతవఱ కెల్లవారు సుఖసంతోషములఁ గలిగియుందురు. సర్వశక్తుఁడైన యీశ్వరునివల్ల నడిపింపఁబడుచున్నప్పుడు భారము లేకుండుట యేమి యాశ్చర్యము. ఎల్లప్పుడు మనము సుఖమునిమిత్తము దేనినైన నపేక్షించుచుందుము. ఈశరీరాభిమానమును విడిచిపెట్టుట దుర్ఘటముగాఁ గనుపించుచున్నది. మతమునిమిత్తము ప్రాణములు విడిచియున్న Lawrence ఉత్తమ పురుషుఁడొకఁడు తనగురువుతోఁ గూడి ప్రపంచమంతయు జయింపఁగలిగెను. ప్రపంచకములో తనకానందముగాఁ దోఁచుచున్న పదార్థములనెల్ల నిరసించెను. క్రీస్తునందలి ప్రేమచే తాను ప్రేమించుచున్న పారమార్థికగురువునుండి యెడబాటు తటస్థించినప్పుడు నయితము మిగుల సహనముతో భరించియుండెను. సృష్టికర్తయైన పరమేశ్వరునందలి ప్రేమచే మానవునిపై గల మోహమును జయింపఁగలిగెను. అతఁడు మానవసుఖముకన్న నీశ్వరప్రీతిని నత్యాదరముతోఁ గోరుచుండెను. నీవును నీశ్వరునియందలి ప్రేమచే నెట్టి రక్తబంధువునైనను పరమమిత్రులైనను త్యజింపనేర్చియుండుము. నీవును నట్టి బంధుమిత్రులచేతఁ బరిత్యజింపఁబడవలసి వచ్చినప్పుడు విచారింపకుము. మానుషమగు కోరిక ను విడిచిపెట్టవలసి

వారమే. మానవుఁడు తన్ను తాను నిగ్రహించుకొనుటకు దీర్ఘకాలము సత్తువకోలేదని నాంతర్యమునఁ బ్రయత్నించుచుండవలయును. తన మనస్సువంతయు నీశ్వరునకర్పింపఁ బాటుపడవలయును. మానవుఁడెప్పుడైన తన్ను తాను నమ్మువయెడల మానవోపశమనముల మరల నపేక్షింపవలసియుండును. క్రీస్తును నిజముగాఁ బ్రేమించువాఁడును యోగ్యతకొఱకు సత్యముగాఁ బాటుపడువాఁడును శరీరభోగములను మానవోపశమనములను నాశింపఁడు. క్రీస్తుకొఱకు కఠినమైన బాధలను సాధనలను సహనముతో భరింపఁగలిగియుండును. అధ్యాత్మికోపశమనము నీ కీశ్వరునివలన దయచేయఁబడినప్పుడు దానిని కృతజ్ఞతతో స్వీకరించి యది నీప్రజ్ఞావిశేషమని భ్రమింపక భావింపక యీశ్వరప్రసాదమని తలంపుము. ఆయీవివలన నీవు నుప్పొంగి గర్వింపక యెక్కువ మెలఁకువగలిగి నీవ్యాపారముల యందుఁ దగినంతజాగ్రతతో వర్తింపుచుండుము. లేనియెడల యీసమయము గతించి మనోపకారము నిన్ను వెనుదగులుచుండును. ఈశ్వరోపశమనము నీనుండి తొలఁగింపఁబడినప్పుడు నీవు నిరాశ జెందకుము. దైవఘటన మరల సంప్రాప్తమగువఱకు నోరిమిగలిగి నమ్రభావముతో వేచియుండుము. మఱియొక సమయమున నీశ్వరుఁడు పరిపూర్ణమయిన మఱియొక యుపశమనమును బ్రసాదింపఁగనిగియుండును. అధ్యాత్మికజీవనమున జీవింపనేర్చినవా రందఱికిని నిది నూతనవిషయముగాక యనుభవైక వేద్యమయినది. ప్రాచీనప్రవక్తలును

మహాత్ములును నిట్టి యవస్థాంతరములను బెక్కుసారు లనుభవించియుండిరి. భగవంతుఁడు చక్కఁగాఁ జూచుచున్నప్పుడొకానొకమానవుఁడు తన సంపదకెన్నఁడును జలనము లేదని తలఁచియుండెను. ఈశ్వరుఁడు వానిని వేఱువిధముగాఁ జూచినప్పుడు "ఓయీశ్వరా! నీముఖమును నాకు మఱుగుపఱచితివి. అందువలన నేను పెక్కుకష్టములఁ గుములుచుంటిని" అని యాతఁడు మరల తనమనోభావమును బ్రకటపఱచియుండెను. కాని యాతఁడింతమాత్రముచే నిరాశజెందక "నేను మొఱబెట్టుచుంటిని. ఓ ప్రభువా! నిన్నుమాత్రమే నేను బ్రతిమాలుకొనుచుంటిని" అని ప్రభువును గాంభీర్యముగాఁ బ్రార్థింపఁజొచ్చెను. ఆతఁడు తుదకుఁ దనప్రార్థనాఫలమును బొందియున్నట్టు తెలియఁజెప్పుటయేగాక తన మొఱ యాలకింపఁబడినట్లు ఋజువుఁజేయుచు "ప్రభువు నా మొర వినె నన్ననుగ్రహించెను. ప్రభువు నాకుఁ దోడునీడ యై నన్నాదరించెను' అని చెప్పఁజొచ్చెను మహాత్ములందఱు నీవిధముగా నీశ్వరవాత్సల్యమును బొందియున్నట్టు గనుపించుచున్నప్పుడు దుర్బలులమైన మనకు మాంద్యమును సంభవించినప్పుడు మనము నిరాశజెంద నవసరము లేదు. మనకు మఱియొకసమయమున శ్రద్ధాభక్తు లుదయింపఁగలవు. మనకిట్టి భావము నీశ్వరేచ్ఛననుసరించి జనించుచుండును. ఇందుచేతనే మఱియొక బుద్ధిమంతుఁడు ( Job ) "ఓప్రభువా! ఆకస్మికముగా నీవు వానికి ప్రాతఃకాలమున బాధనూపి వానిని రక్షించితివి" అని చెప్పియుండెను.

నా నమ్మకమును విశ్వాసమును నీశ్వరానుగ్రహమునం దుదక్క యింక నెందు నుంచఁగలను? నే నెప్పుడును నీశ్వరానుగ్రహమును మాత్రమే యాశించుచుంటిని. ఈశ్వరానుగ్రహము నాయందు లేనప్పుడు, నే నుత్తమపురుషులతో స్నేహించియున్నను, భక్తిపరులైన సోదరబృందముచేఁ బరివేష్టింపఁబడియున్నను బవిత్రములైన యుద్గ్రంథములు నాకు లభించియున్నను మధురమైన స్తుతిపాఠంబులు జనన సందర్భపడినను నివియన్నియు నాయధ్యాత్మికజీవితమునకుఁ దోడ్పడి నాకు సంతృప్తిని గలిగింపలేకపోవుచున్నవి. అట్టిసమయమందు మనము సంపూర్తిగా నీశ్వరేచ్ఛకు లోఁబడి యోరిమితో వేచియుండుటకన్న నుత్తమసాధన మేదియుఁ గనుపించదు. ఈ విధముగాఁ గొన్నిసమయములయం దీశ్వరవాత్సల్యమునకు దొలఁగియుండని భక్తుఁ డెవ్వఁడును గనుపించఁడు. భక్త్యావేశ మప్పుడప్పుడు క్షీణింపనివాడు సయితము లేడు. ఆదియందు గాని యంతమందుగాని మనోవికారమునకు లోనుగాక యెల్లప్పుడు సంతోషముగలిగి సుఖించుచున్న మహాత్ముఁ డెవ్వఁడును భగవంతునికొఱకెట్టిబాధనైనను నోరిమితో భరించి సర్వకాల సర్వావస్థలయందును నీశ్వరుని చింతించుచున్నవాడు కానరాడు. ఉపశమనమునకు ముందు బాధలును కష్టములును నతిశయించుచున్నప్పు డుపశమనము సమీపించుచున్నదని యెఱుఁగవలయును. ఈశ్వరోపశమనము మనోవికారముల నోరిమితో భరింపఁగలిగినవారికి మాత్రమే ప్రసాదింపఁబడు

చున్నది. "మనోవికారములను జయింపఁగలిగినవానికి జీవిత ఫలము ననుభవింపఁ బ్రసాదించెదను" అని భగవంతుఁడు నుడివియుండెను. కష్టముల భరింప సామర్థ్యము గలిగియుండు టకుఁగూడ యీశ్వరోపశమనము మానవునకుఁ బ్రసాదింపఁ బడుచున్నది. అధ్యాత్మికగర్వము నడ్డు పెట్టుటకు మనోవికారము వెంబడించుచున్నది. దయ్యమింకను నిద్రింపలేదు. అహంభావ మింకను జావలేదు. నీ కుడియెడమ భాగములయందు నీశత్రువర్గము పెచ్చు పెరిగియుండుటచే పోరాటమునకు సిద్ధపడియుండుము.

10 ఈశ్వరవాత్సల్యమునకు కృతజ్ఞుఁడవయియుండుము.

నీవు శ్రమపడుటకు నుద్దేశింపఁబడినప్పుడు నెమ్మదిగాఁ గూర్చుండుటకు నేలయభిలషించెదవు? ఆనందించుచుండుట కన్న బాధలను భరించుటకును సుఖముననుభవింపఁగోరుట కన్న నోరిమిగలిగియుండుటకును సంసిద్ధమైయుండుము. తా ననుభవించుటకు వీలుపడినయెడల సుఖమును నానందమును బడయఁగోరనివాఁడెవఁడుండును? శరీరభోగములకన్నను ప్రపంచ సుఖములకన్నను నధ్యాత్మికోపశమన మత్యాదరణీయమై యున్నది. ప్రాపంచికసుఖములన్నియు దోషదూషితములు. నిరర్థకములు. అధ్యాత్మికసుఖము మనోహరమైనది. ప్రస్తుతింపఁదగినది. సౌభాగ్యతమండియు పావనత్వమునుండియు నుద్భవించుచున్నది. భగవంతునివలన పావనహృదయములయందు మాత్రమే పూరింపఁబడుచున్నది. ఈయీశ్వరోపశమనముల

నెల్లరు తమయిచ్ఛానుసారముగ ననుభవింపఁజాలరు. ఎందుచేత
ననఁగా మనోవికారము వారల తఱుచు బాధించుచుండును.
మనోవికారముల విడిచిపెట్టఁగలిగిన స్వేచ్ఛాభావము వారిహృద
యమున స్థిరముగా నిలిచియుండుటలేదు. అవ్యక్తమైనమనస్వా
తంత్ర్యమును నహంభావత్వమును నీయాత్మవిషయములకుఁ
బ్రతిబంధములై యున్నవి. ఈశ్వరుఁడు తనవాత్సల్యోపశమన
మును మానవులకుఁ జక్కఁగాఁ బ్రసాదించుచున్నవాఁడుకాని
మానవుఁడు తనకుఁ బ్రసాదింపఁబడినదానిని కృతజ్ఞతతో మరల
యీశ్వరునకు సమర్పించుచుండ లేదు.ఇందుచేత నేయావాత్సల్య
ప్రవాహము మనయందు పరిపూర్ణముగాఁబ్రవహించుటలేదు
మనవాత్సల్యప్రదాతయెడల మిగుల కృతఘ్నులమై యాప్ర
సాదింపఁబడినవాత్సల్యమును మరల మునిమూలమునకుఁ బ్రవ
హింపఁజేయ లేకపోవుచుంటిమి. ఎవరునిజముగా నీశ్వరునియందు
కృతజ్ఞులైయుందురో ఈశ్వరవాత్సల్యము నిజముగా వారియధీ
నమై యున్నది.ఆవాత్సల్యము గర్విష్ఠులయధీనమునుండి తొలఁ
గింపఁబడి దీనులకుఁ బ్రసాదింపఁబడుచుండును. అనుతాపభావ
మును నాహృదయమునుండి తొలఁగించెనియుపశమనమును నే
నన్వేషింపను. ఇంతియేగాక నాకు గర్వమును గలిగించెడిసా
మర్థ్య మీశ్వరోపాసనవలన నాకుఁ గలుగవలయుననినయితము
నే నపేక్షింపను.మనకు మాహాత్మ్యముగాఁ దోఁచుచున్నవిషయ
ములన్నియు పావనములైనవి గావు. మనము హితముగానున్న
విషయములన్నియు మంచివికావు. నేను కోరుచున్నకోరికలన్ని

యు పరిశుద్ధములైనవి గావు. నాకుఁ బ్రేమాస్పదమైనవన్నియు నీశ్వరునకు బ్రియములు గావు. ఇంతకన్నను నెక్కుడు అణకువనుగలిగించునట్టియు నింతకన్నను నెక్కుడుపావనమైన నీశ్వరభక్తిని గలిగించగలిగినట్టియు స్వార్థపరత్వమును నింతకన్నను నధిక వైరాగ్యముతో త్యజింపనుత్సాహమును గలిగించునట్టియు వాత్సల్యమును మాత్రమే బడయ నపేక్షించుచుందును. భక్తిభావమును గలిగించునట్టియు దానికి విఘాతమును గలిగించునట్టియు స్థితుల రెంటిని బొందియున్నవాఁడు తగినంత లాభమును బొందఁగలిగియున్నట్టు యోచింపఁబడను. ఆతఁడన్ని విషయములయందును నిరర్థకుఁడని తెలుసుకొనఁబడును. భగవత్సంబంధమైనదానిని భగవంతుని కర్పింపుము. నీస్వంతమైనదానిని నీకు నారోపించుకొనుము. అనఁగా నీశ్వరుఁడు నీకనుగ్రహించియున్న వాత్సల్యమునకు నమస్కారములు వానికి సమర్పింపుము. నీవనుభవించుచున్న పాపము నీస్వయంకృతాపరాధమని తెలుసుకొనుము. నీవందఱికన్నను దక్కువగా నున్నట్లు యోచించుకొంటివేని నీవందఱికన్నను నధికుఁడవై ప్రకాశింపఁగలవు. తక్కువస్థితి లేకయె యెక్కువస్థితి యెన్నఁడును సంభవింపనేరదు. భగవంతునిముందు గొప్పవారై ప్రకాశించుచున్న మహాత్ములందఱు తమదృష్టియందు మిక్కిలి తక్కువగా నుండనేర్చినవారే. వారు తమమనస్సునందెంత యణఁగియుండిరో యంత యాధిక్యముతో వారు ప్రకాశించుచుండిరి. వారేవిషయమునందును గర్వించుటలేదు. వారు సత్యమును పారమార్థికానంద

మును పూర్తిగాఁ గలిగియుండుటచే వారికివ్యర్థమైనయానంద
ము నిరర్థకములైనసుఖములను నభిలషించుటలేదు. వారు స్థిర
మైననిశ్చితార్థమునుభగవంతునియందుమాత్రమేగలిగియుండిరి.
తాము పొందుచున్న మేళ్ళన్నియు భగవంతునియనుగ్రహము
వలననే లభించుచున్నవని యథార్థగానమ్మియున్నవారందఱు
తదన్యమైనవిషయానందమును నించుకయుపాటింపరు. ఈశ్వరుని
వలనలభించెడి పరమానందమునకుమాత్రమే వారుప్రయత్నిం
చుచుందురు. ఈశ్వరుఁడు తనయందును మహాత్ములయందును
నానందింపఁబడవలయుననిమాత్రమే వారుగోరుచుందురు. వారు
భావమునం దీనదానమునేగలిగి వ్యవహరించుచుందురు. నీవేది
యైన నించుక మేలు తెలస్థించినప్పుడు మిగులకృతజ్ఞుఁడవై యుం
దువు. అందువలననీవుగొప్పమేళ్లనుబొందనర్హుఁడవై యుందువు.
నీకుఁబ్రసాదింపఁబడిన మేలు మిగులసూక్ష్మమైనను నదియన్నిటి
కన్నను మిగులగొప్పదై యున్నట్టుయోచింపుము. మేలు పైకిహే
యముగాఁ గనుపించుచున్నను, దానియందుఁ బ్రత్యేకించి
వేఱువిధమైన విలువమఱియొకటి గలిగియున్నట్టుయోచింపుము
ఆమేలుననుగ్రహించియున్నమహాత్మునిగౌరవమ్మును యోచిం
పఁగలిగితివేని యదిసూక్ష్మమైనట్టును హేయమైనట్టును గను
పింపదు. పరమాత్మునివలన దయచేయఁబడిన మేలెన్నటికిఁ జిన్న
దిగానేరదు. భగవంతుఁడుమనకు శిక్షలను బాధలనుబ్రసాదించి
నను నవియన్నియు మనక్షేమమునిమిత్తముద్దేశింపఁబడినందున
మనమువానియెడల కృతజ్ఞులమైయుండవలయును ఆయీశ్వరా

నుగ్రహమును మనయందు స్థిరముగా నిలుపుకొనఁదలచిన యెడ
ఆయన మనయందు గలిగియున్న వాత్సల్యమునకు మన మెల్ల
ప్పుడు కృతజ్ఞులమై యుండవలయును. అది మననుండి తొలగింపఁబడి
నయెడల పరమవిధేయులమై యోరిమిగలిగి మరల ప్రసాదింపవ
లసినదని వానిని ప్రార్థించుచుండవలయును. దానిని నీవు పోగొట్టు
కొనకుండుటకు మెలకువగలిగి పరమవిధేయతతోఁ బ్రవర్తించు
చుండవలయును.

## 11 శిలువను ప్రేమించుట.

ఈశ్వరరాజ్యమును బడయఁగోరిన జీససుభక్తులనేకులు
గలరు. కాని, యాతఁడు వహించియున్న శిలువను భరించఁగలి
గిన వారెవ్వరును లేరు. ఆతని యుపశమనములను బొందనపే
క్షించుచున్నవారు పెక్కండ్రు గలరు. కాని, వానియిష్టముల
ననుభవించఁదలఁచిన వారంతగాఁ గనుపింపరు. ఆతని సహపంక్తిని
భుజింపఁబ్రయత్నించు వారనేకులు గలరు. వానితో నుపవా
సములగ్రహించిన వారెవ్వరు లేరు. అందఱును క్రీస్తుతో సం
తోషింపఁగోరినవారలే. వానికొఱకు లేశమైన బాధను భ
రింపఁగలిగిన వారరుదుగాఁ గనుపించుచున్నారు. భోజనముకొ
ఱకు వానిని వెంబడించువారు పెక్కండ్రుగలరు. వానిమనో
భావమును బడయఁదలఁచిన వారెవ్వరును లేరు. ఆతనియద్భు
తకార్యములను గౌరవించువారనేకులు గలరు. కాని వానిశిలువ
యొక్కయవమానమును భరింపఁజూచెడి వారెవ్వరు కానరా
రు. సుఖముగాఁ గనుపించుచున్నంతవఱ కందఱును క్రీస్తును

ప్రేమించుచుందురు. వానివలన నుపశమనము లభించుచున్నంతవఱకు నెల్ల వారును వానిని స్తోత్రవందనాదికృత్యములఁ బూజించుచుందురు. అత్యల్పకాలమయినను జీసను వారికిఁ గనుపింపక దాఁగియున్న యెడల వారు మొఱలిడి శపించుచుందురు. తమసుఖముకొఱకుగాక జీసనునందలి ప్రేమచేతనే జీససును ప్రేమించువారు తమహృదయము పరితపించుచున్నప్పుడును, ఆనందించుచున్నప్పుడును, నుపశమనము బొందఁగలిగినప్పుడును బొందలేకపోయినప్పుడును, వానిని సదా ప్రేమించుచుందురు. వానివలన తమకెట్టి యుపశమనము లభింపకపోయినను వానిని వారు సర్వదా పూజించుచుందురు. స్వార్థపరత్వముతోఁ గూడియుండనప్పుడు జీసనుమీఁద పరిశుద్ధమయినప్రేమ యెంతబలముగలది ! సుఖసంపాదనము నిమిత్తము వానిని సేవించుచున్న వారిజీవితము కూలిజీవితము. ఎల్లప్పుడు తమలాభమునుమాత్రమే చూచుకొని జీసనును సేవించుచున్న వారు శుద్ధ స్వార్థపరులు స్వార్థపరత్యాగులై యీశ్వరుని సేవించువారెవరు ? స్వార్థపరత్యాగియైన జ్ఞానవంతుఁడు కనుపించుట దుష్కరము. ప్రాపంచికపదార్థములయందు నిస్పృహాత్వము గలిగి నమ్రభావమును గలిగియున్న యుత్తమపురుషుఁ డెందు గలఁడు? వానివిలువ యపారమైనది. దిగంతరాళముల వ్యాపింపఁగలది. మనుష్యుఁడీలోకమున దాను బొందియున్న సర్వమును విడిచిపెట్టఁగలుగుట గొప్పవిషయముగాదు. కఠినమైన సాధనముల నభ్యసింపఁగలిగినను గొప్పవిషయము గాదు. సర్వశా

స్త్రముల నభ్యసించి యమితమైన పరిజ్ఞానము గలిగినను స్వల్ప విషయమే. సర్వయోగ్యతలను వహించి దృఢమైన భక్తిభావమును గలిగియున్నను వానియం దింకను కొంతకాలము కనుపించుచున్నది.

మానవునియందుండవలసిన ప్రధానమైన విషయమొకటిగలదు. అది వానికి మిగుల యావశ్యకమైనది. అది యేదియన తాను సర్వమును బరిత్యజించుటయేగాక తన్నుసయితము తాను బరిత్యజించియుండుట స్వాభిమానమును బూర్తిగాఁ ద్యజించుట నీకు విధాయకములైన కృత్యములన్నియు నాచరింపక విధిలేనివగుటచే వానిని నీవాచరించినను నది యొక గొప్పవిషయముగాదని యోచించుకొనుము. లోకమందలివలవను గొప్పవిషయముగా పరిగణింపఁబడుచున్నంత మాత్రము చేత నేవిషయమును గొప్పవిషయమని యోచింపకుము. నీవు యథార్థముగా నిరర్థకుఁడవైన సేవకుఁడవని భావించుకొనుము. ఏలననఁగా "నీవు విధికృతములైన ధర్మములను నెరవేర్చినప్పుడుసయితము నీవు నిరర్థకసేవకుఁడవని తెలుసుకొనుము" అని సత్యము చెప్పుచున్నది. ఎవరైనను దాను నిరాధారుఁడయి యున్నట్లును తెలుసుకోఁగలిగినయెడల నాతఁడు భావమునందు వినయవిధేయతలు గలిగియున్నవాఁడగును. తన్ను తాను విసర్జించుటయే గాక సర్వవిషయములను సయితము విసర్జించి మిక్కిలి హైన్యమయిన తావునం దధిష్ఠింపఁగలిగిన యుత్తమపురుషునికంటె నధికధనవంతుఁడును స్వతంత్రుఁడును బలావంతుఁడును వేఱొకఁడు లేఁడు.

## 12 పావనమైన శిలువ.

స్వార్థపరిత్యాగము గావింపుము. శిలువను ధరింపుము. జీససును వెంబడింపుము " అనుమాటలు మానవులకుఁ గఠినములై యుండవచ్చును. "నీవు నన్ను పరిత్యజించుము. శాశ్వతనరక బాధల నొంది దుఃఖింపుచుండుము" అని కడపట ప్రభువు నుడివియున్న శాపవాక్యము వినునప్పుడు హృదయమునకు మఱియెంత కఠినమై తోఁచవచ్చును. శిలువనుగూర్చిన బోధనలను హృదయపూర్వకముగా వినఁగోరినవారును విని దానిని ననుష్ఠింపఁగలిగినవారును పై నుదహరింపఁబడినట్లు శిక్షాస్మృతికి భయపడనేరరు. ప్రభువు విచారింపవచ్చినప్పుడు యీ చెప్పఁబడిన శిలువయొక్క గుఱుతు పరలోకమందు గనుపించుచుండును. శిలువవేయఁబడిన స్వరూపము ననుసరించి జీవింపనేర్చిన సేవకులందరు న్యాయాధిపతియైన జీసను నధిక విశ్వాసముతో నిర్భయులై సమీపింపఁగలరు. శిలువ నిన్ను స్వర్గరాజ్యమునకుఁ గొనిపోవుచున్నప్పుడు దానిని నీవు వహించుట కేల భయపడెదవు? ముక్తిమార్గము శిలువయందుఁ గనుపించుచున్నది. జీవనము రక్షణము ఆధ్యాత్మికమాధుర్యము. మనోబలము మొదలయిన సౌభాగ్యములన్నియు శిలువయందున్నవి. యోగ్యతయొక్క యౌన్నత్యము, పరిపూర్ణ పావనత్వము, ఆత్మానందము మొదలయిన పరమార్థవిషయములన్నియు శిలువయందుఁ బ్రకాశించుచున్నవి. శాశ్వతజీవితాశ రక్షణోపాయము మొదలయిన వేమియు శిలువయందుదప్ప యింకదేనియందును గనుపింపవు. నీకు ముందు జీసను శిలువను ధరించి చనియుండెను. నీకొఱకు శిలువపై ప్రాణములువిడిచి చనిపోయెను. నీవుసహితము శిలువనువహించి శిలువపై మరణించితివేని

వానితో మరణము బొందవలయునని యీయన సంకల్పము. నీవు వానితో జీవించెదవు. వాని బాధలయందు నీవు వానిననుసరింపఁగలవేని వాని పరమానందమునందుఁగూడ వానిననుసరింపఁగలవు. సత్యము శిలువయందు గనుపించుచున్నది. కనుక అది మార్గము. శిలువపైఁ జెందెడి మరణము మీఁదనే సర్వమును ఆధారపడియున్నది. పవిత్రమయిన శిలువ మార్గము తప్ప చిత్తశాంతిని గలిగియుండుటకును స్వచ్ఛందజీవితము నవలంబించుటకును నితరమార్గ మేదియు లేదు. నీ వెచ్చోట కేగఁదలంచిన నేగుము. నీవు చేయఁగలిగిన ప్రయత్నములన్నియు జేయుము. దీనియందు శిలువకన్న నుత్తమమార్గ మేదియుఁ గనుపించదు. భూమియందు సురక్షితమయిన మార్గము మఱియొకటి లేదు. ఆనందప్రదమయిన నీయిచ్ఛ ననుసరించి యన్ని విషయములను క్రమముగాఁగాని నేర్పాటించుము. నీయిచ్ఛానుసారముగాఁగాని వేఱొక విధముగాఁగాని దానియందు నీవు కొంతబాధ ననుభవించుచుందువు కనుక నీకు శిలువయెల్లప్పుడు కనుపించుచుండును. శరీరమునందుఁగాని మనస్సునందుఁగాని బాధ ననుభవించుచున్నప్పుడు మనోకలవరము సంభవించుచున్నది. కొన్నిసమయములయందు నీవీశ్వరునిచేత పరిత్యజింపఁబడుచుందువు. [illegible]న్న నీవు సంయోగము తెలియుచు నీతో ఘోరముగా బాధపెట్టుకొనుచుందువు.

ఏపరిహారము వల్లను నిన్ను నీ వుద్ధరించుకొనఁ నేరవు. ఏయుపశమనము వల్లను నీవు విశ్రాంతిని గలిగియుండ నేరవు. ఈశ్వరసంకల్పమును బట్టి నీ వెంతకాలము బాధపడవలసియుండునో అంతకాలము నీవు బాధపడుచుండుట తప్పదు. దానిని దప్పించుకొనుటకు వేఱుసాధన మేదియు నుండనేరదు. ఏయుపశమన

మును లేకయే నీవు బాధలను సహింపనేర్చియుండవలయునని యీశ్వరసంకల్పము. నీవు వానికి పూర్ణముగా విధేయుఁడవై యీ బాధల మూలమున నమ్రభావమును నేర్చియుండవలయునని యీశ్వరుఁడు సంకల్పించియుండెను. క్రీస్తువలె బాధలననుభవించఁగలిగిన మానవుఁడు తప్పక వానిమనోభావమును హృదయముతో స్పృశింపఁగలిగిన పురుషుఁడెవ్వఁడును లేఁడు. శిలువ యెల్లప్పుడు నీ చేరువనుండి ప్రతిచోటను నీకొఱకు నిరీక్షించుచున్నది. నీ వెచ్చటకు బరుగువారినను, ఎచ్చోట దాఁగినను నీవు దానిని దప్పించుకొనఁజాలవు. నీ వెచ్చటకు వెళ్లినను నీ యహంభావమును నీతోఁ గొనిపోవుచుంటివి. నీ యహంభావమును నీ వెప్పుడును విడిచిపెట్టలేక పోవుచుంటివి. భూమ్యాకాశంబులఁ బరిశీలింపుము. నీ బాహ్యాంతరములఁ బరీక్షించుము. నీ వెచ్చట పరికించినను నీ కన్నులయెదుట శిలువయే గనుపించుచున్నది. నీవు చిత్తప్రశాంతిఁ బడయఁగోరినను శాశ్వతఫలమును బొందఁదలఁచినను నీ వెల్లయెడలను నోరిమి గలిగియుండుటకును నభ్యసింపవలయును. నీవు శిలువను సంతోషపూర్వకముగా భరింపఁగలిగితివేని తుదకది నిన్ను వహించి నీవు పొందవలసియున్న గమ్యస్థానమునకుఁ గొనిపోవును. ఇచట నీవు పొందుచున్న బాధ లేవియు నచ్చోట గనుపింపవు. నీవు దానిని నిష్టముతో భరింపఁబూనితివేని అది నీకు మిగుల దుర్భరమై యధిక భారమును గలిగియుండును. ఏది యెటులున్నను తుదకు నీవు దానిని భరించితీరవలయును. నీపాలి శిలువను నీవు భరింపవలసియుందువు. మనుష్యమాత్రుఁడైన వాఁ డెవ్వఁడును దప్పించుకొనలేనిదానిని నీవు దప్పించుకొనఁగలవని దలఁచెదవా ? ఈలోకమున కష్టములను, బాధలను ననుభవింపని మహాపురుషుఁడె

వ్వఁడుగలఁడు ? జీవించియున్నంతవఱకు జీసనునకైనను తనమనోభావము నందు విచారమునొందని నిమిషమేదియైనగలదా ? క్రీస్తుబాధల ననుభవించి చనిపోయినపిదప మరణలేచి పరమానందము నొందఁగలిగెను. అని యాతఁడు నుడివియుండెను. నీవీ రాజమార్గము ను (శిలువయొక్క మార్గము) దప్ప యితరమార్గమున నెట్లు ప్రయత్నింపఁగలవు ? క్రీస్తు జీవితమంతయు బాధలతో నిండియుండె. మరణమునిమిత్త మాతఁడు చంపఁబడెను. అట్టివిషయములో నీవు సుఖించుటకును విశ్రమించుటకును గోరుచుండెదవా ? కష్టము ననుభవించుటకన్న వేఱువిషయమును దలంచితివేని యది నీకుఁ బ్రమాదకరము. గొప్ప పొరబాటు. మానవజీవితమంతయు కష్టములతోఁ బూర్ణముగా నిండియున్నది. ఎల్లకడల బాధలను సూచించుచున్నవి. అధ్యాత్మికజీవితమందు మానవుఁడధికముగా నభివృద్ధిఁజెందినకొలఁదిని వానికష్టములయొక్క భారము నంతయంత యతిశయించుచుండును. వానిబాధ యీశ్వరునియందు వానికిఁ బ్రేమ యతిశయించినకొలఁదిని నంతంతబలపడుచుండెను. ఇట్టిమానవుఁడు పలువిధములైన బాధలననుభవించుచున్నను నుపశమనమును లేకయుండఁడు. సహించియున్న బాధలకుఁ దగినఫలము నొందఁగలనన్ననమ్మకము వానిని నుపశమింపఁజేయుచుండును. అట్టిబాధలను దన్ను దాను హృదయపూర్వకముగా వశపఱచియుండుటచే కష్టములయొక్క భారము శ్వరోపశమనముగా పరిణమించుచుండును. అంతరంగికోపశమనము వలన హృదయమున కెంతవఱకు బలముగలుగునో అంతవఱకు నహంకారమడఁగియుండును.

యేసునుయొక్క శిష్యుల ననుసరింప నపేక్షించుటచే కష్టములను బాధలను భరింపఁగలిగిన యెడల మానవుఁడు తగినంత మనోబలముగలిగి విచారమునకును బాధలకును భయపడక యవి తనకు శ్రేయోదాయకములనియే భావించుచుండును. విషయములు తనకు బాధకరములుగాను కఠినములుగాను గనుపించుచున్న కొలఁదిని, సర్వము నోర్చుకొని భరింపశక్తి గలిగియుండుటచే నీశ్వర దృష్టికిఁ దానుమిగుల హితుఁడై యుండునన్న దృఢనమ్మకమును గలిగియుండును. తానట్లు అధిక సాహసముగలిగి వర్తించుటకు కారణము మానవుని స్వకీయబలముగాదు. ఈశ్వరవాత్సల్యమే కారణము. మానవహృదయము మిగుల దుర్బలమైయున్నను తన కహితములైనట్టియు బాధాకరములగునట్టియు కార్యములను సాహససంతోషములుగలిగి హృదయపూర్వకముగా నెరవేర్పఁగలుగుటకు నీశ్వరానుగ్రహముగాక వేఱు కారణమేమున్నది. కష్టములను బాధ ననుభవించుటయు శరీరమును కృశింపఁజేసి నమ్రభావమునకుఁ గొనితెచ్చుటయు ప్రాపంచికగౌరవముల కాశింపకుండుటయు దూషణతిరస్కారములను సంతోషముతో భరింపఁగలుగుటయు, తన్నుదాను తిరస్కరించుకొనుటయు యితరులవలన దిరస్కరింపఁబడఁగోరుటయు నెట్టికష్టములనైనను క్షమలతో భరింపఁగలుగుటయు లోకసుఖముల నపేక్షింపకుండుటయు నివి యన్నియు మానవప్రకృతి ననుసరించియున్న విషయములుగావు. నీమానవస్వభావమును నీవు చక్కఁగాఁ బరీక్షించితివేని యీగుణములన్నియు నీస్వకీయబలము ననుసరించి యుండవన్నట్లు నీవు తెలిసికొనఁగలవు. నీవు ప్రభువునుమాత్రమే నమ్మితివేని వానియనుగ్రహమువలన దగినబలముగలిగి నన్నను నీమాంసప్రకృతిని జయింపఁగలిగియుందువు. ఈలోకమం

గలిగినవారుతప్ప యితరులెవ్వరును పరమార్థవిషయముల ను దెలిసికొనజాలరు. ఈశ్వరునినిమిత్త మెట్టికష్టమునైన ను నీవు సంతోషముతో భరించియుండుటకంటె యీ ప్రపంచకములో నీకు క్షేమకరమైనదియు నీశ్వరునకు ప్రీతికరమైనదియు వేఱొకటిలేదు. నీవు కోరవలసివచ్చినప్పుడు యుపశమనములచే సేదదీర్చుకొనుట కిష్టపడక క్రీస్తుకొఱకు బాధల భరించుటకే కోరుకొనుము. అందువలన నీవు క్రీస్తునకు ప్రేమాస్పదుండవై యుత్తమపురుషులందఱును బొందియున్నగతిని బొందఁగలవు. మనయర్హతయు జీవితమునందు మనము బొందియున్న జ్ఞానాభివృద్ధియు మనమిచట ననుభవించుచున్న యసంఖ్యాకములైన సుఖములనుబట్టియు యుపశమనములనుబట్టియు లెక్కింపఁబడవు. అనేకములైన కష్టములను బాధలను నోర్మితో సహింపఁగలిగియుండుటనుబట్టి యవి పరిగణింపఁబడుచుండును బాధలను భరించుటకన్న మానవుల ముముక్షుత్వమునకు మంచి సాధనము మఱియొకటి; యున్నయెడల క్రీస్తు దానిని మనకు దృష్టాంతరమువలనను బోధనలవలనను జూపియుండును. వానిననుసరింపగోరిన శిష్యవర్గమునకంతకు కష్టముల భరించుటకన్న మోక్షమునకు వేఱుసాధనమేదియు లేదని బాహాటముగా నుడివియుండెను. "ఎవరైన నన్ను ననుసరింపఁజూచినయెడల స్వార్థపరిత్యాగులరై శిలువను ధరించి నన్ను వెంబడింపుఁడు" అని క్రీస్తు నుడివియుండెను. మనమెన్ని గ్రంథముల జదివినను నెన్ని శాస్త్రముల బరిశీలించినను "బాధలమూలమున మన మీశ్వరరాజ్యమును జేరవలసియుంటిమి" అను సత్యవచనమాత్రమే మనము గ్రహింపవలసిన వస్తువైయున్నది. ద్వితీయభాగము సమాప్తము.

